

అనాధులకు నాధుడు

చిత్రకారుడు : సి. ఎస్. వెంకట్రావుగారు

# ఓ పరమేశ్వరా!

విడుతువా నను నీవు?—విడువవు! విడువవు !!
విడువవు !!! నే నెంత చెడుగనైన
మనుపవా నను నీవు?—మనుతువు! మనుతువు !!
మనుతువు !!! నే నెంత చెనఁటినైన
చెఱుతువా నను నీవు?—చెఱపవు! చెఱపవు !!
చెఱపవు !!! నే నెంత చెట్టనైన
కానవా నను నీవు?—కాంతువు! కాంతువు !!
కాంతువు !!! నే నెంత కలుషినైన

భక్తసంరక్షణమె నీస్వభావగుణము
పాత్రగుణములతో నీకుఁ బనియె లేదు
ఒరుఁడు కష్టింపఁ గని యూరకుండలేవు!
పరుఁడు ప్రార్థింప విని వ్యర్థపఱుపలేవు !!

— నూటపదియార్లు.

1938 నవంబరు




# సంస్కారము లేని చదువెందుకు?

‘ఫలానా’ వారికి ఇలాంటి వధువు కావలెను; ‘ఫలానా’ వారికి ఇలాంటివరుడు కావలెను’ ఇత్యాది ప్రకటనలు చాలా పత్రికలలో కనబడుతూవున్నవి.

వాటిలో ఆశ్చర్యాన్ని, విచారాన్ని, దిగ్భ్రమనుకూడా కలిగించేవాటిని పాఠకులపుడపుడు చూస్తూనే ఉంటారు.

ఎంత విద్యాధికులైనా, సంస్కరణవాదులైనా కొంతమంది తమ వివాహవిషయాల్లో మానవత్వం ఎంతమాత్రమూలేనట్టు ప్రవర్తిస్తుంటారు. తమ వివాహాన్నిగురించిన అభిప్రాయాలను నలుగురిలో వెల్లడించడానికి జంకుతారు. ఎందుకంటె అది నగుబాటవుతుంది.

అంతటితో వదలితేనా? విన్నవారంతా ‘విద్యాధికులై సంఘక్షేమం కోరడానికి బదులుగా మీరే మీ విద్యాసంస్కారాలను ఇలా వెలగబెడుతూవుంటే తక్కిన వారిమాట ఇంకెందుకు?’అని చీవాట్లుకూడా వడ్డించవచ్చు.

అందుచేత ఊరుపేరులులేకుండా తాము ఏఉద్దేశాల ప్రకారము వివాహమాడదలచుకున్నారో దానిననుసరించి వధువులు కావాలని ప్రకటిస్తారు. తమతో ఏకీభవించిన వారే ప్రకటనకర్తలతో ఉత్తరప్రత్యుత్తరాలు జరుపుతారు. ఫలితము: సంఘదురాచార దోహదము; అమాయిక బాలికలకు యావజ్జీవ శిక్ష.

మచ్చుకు ఒకటి చూద్దాము. ‘నేను ఉన్నత విద్యాధికుడను. ఇంతవఱకూ చది

వాను. ఇంకా కొంత చదువవలసివుంది. దానికి నాకు ధనసహాయం కావాలి. ధనవంతుల కుటుంబములోని కన్య అయితేచాలు కుంటిదైనా గుడ్డిదైనా కురూపైనా పెళ్లాడుతాను. మా (ఫలానా) వర్ణములో అంతర్వర్ణములైనా ఫరవాలేదు' అని ఒక విద్యార్థికుడు ఇటీవల ఒక పత్రికలో ప్రచురించినాడు!

ప్రకటనలలో కట్నాలమాట ఎక్కడైనా కనపడితే విద్యార్థికులలోకూడా యీ మాత్రం సంస్కరణ ఇంకా రాలేదా అని విచారపడతాము. పై ప్రకటనను చూచి ఏమనాలి!

ఒక్కరీతిగా ఆ విద్యార్థికుని సమర్థించవచ్చును.

అతడు ఉన్నత విద్యార్థికుడే. అయితే ఇంకా విద్య నభ్యసించాలనే ఉత్తమాశయము అతని హృదయములో పైకుబుకుతూ వుంది. మార్గము? ధనసాహాయము కావాలి? చేసేవారెవరూ లేరు. ఇతర పాదికలెక్కడా పారవు. అందుచేత తనవిద్యను, పౌరుషాన్ని కూడా అమ్మివేసి తన ఆశయము నెరవేర్చుకొనవలెనని ప్రయత్నించినాడు.

ఆశయాన్ని పొందడానికి త్రొక్కేదారి, అవలంబించే పద్ధతి దూష్యమైతే ఆశయము తప్పకుండా దూష్యమవుతుంది.

ఉన్నతవిద్య పొందాలనే ఆశయాన్ని ఫలింపచేసికొనడానికై కురూపినైనా, అంగవికలనైనా వివాహమాడుతానన్నాడు ఆ ఉన్నతవిద్యార్థికుడు. అయితే తన ఉన్నత విద్యకు తోడ్పడిన ఆ అంగవికలమీద, కురూపిమీద, దాంపత్యప్రేమ, తుద కభిమానమైనా అతని హృదయములో ఎంత కాల ముంటుంది?

ఉండదని నిర్ణయమేమంటే—

ఉన్నత విద్యార్థికుడైయుండీ కూడా, వివాహమంటే ఏమో, అది యావజ్జీవసంతోషప్రదమై వుండాలంటే వధూవరులు ముందే ఆలోచింపవలసిన సంగతులేటివో, ఎంత మాత్రమూ గమనించకుండా కేవలము స్వార్థానికై ఎవరినైనా మెడగట్టుకొంటాననే అతని హృదయములో స్థిర విశ్వాసానికి తదితర ఉన్నతగుణాలకూ చోటుకూడా వుంటుందా?

వివాహ మాతుందని అనుకుందాము. 'డబ్బుకే నన్ను పెళ్లాడారు' అనేభావము మనసులోవుండి ఆ ఇల్లాలికి నిరంతరభయ కారణమవుతూ వుంటుంది. భార్య ఎంత విశ్వాసముతో వర్తిస్తూవున్నా డబ్బుతోటి ఆవశ్యకత తీరిపోయింది కాబట్టి భర్తకు, భార్యకున్న లోపమేదో స్ఫుటముగా కనపడుతూ, ఏవగింపుకు కారణమవుతుంది. ప్రేమవుంటే లోపములు కనపడవు గాని ఇలాంటి సంబంధాల్లో అది ఒక వేయిమైళ్ల దూరాన వుంటుంది. అందుచేత ఆ దాంపత్యము స్వర్గసుఖమనుభవించదు, నరకయాతనకు గురవుతుంది. ఎక్కువయాతనకు పాల్పడేది స్త్రీయే.

వరకట్న నిషేధశాసనము లోకవేళ వివాహాలు జరుగకుండ కొంతవరకు తోడ్పడునేమో యని అనుకొనేవారము. కాని ఆత్మసంస్కారములేని సంఘములో ఇవి కూడ పూర్తిగా ఉపకరింపవనుటకీ విద్యార్థినుల చర్యలే సాక్షి. శాసనమున్ననాడు ప్రకటనలు లేకనే లోలోపలనే ఇట్టి సంబంధముల కుదుర్చుకొనుటకీ విద్యార్థిను లెంతమాత్రమూ వెనుదీయరు.

పోతే, డబ్బుకొరకు మాత్రమే జరిగే పెళ్ళిళ్ళు నిలవడానికి, వాటివలన సంఘానికి,—ముఖ్యముగా స్త్రీలోకానికి—కలిగే కీడును గమనించిన సహృదయులు వాటిని నిలువడానికి మార్గమేలేదా?

ఉంది. అయితే పట్టుదల ఐకమత్యమూ కావలెను. దీనికి స్త్రీలే ముందంజవేయవలెను.

సంతోషసౌఖ్యాలతో నిండిన సాంసారిక జీవితమూ, శాంతిపూరితమైన గృహిణి బ్రదుకూ దేనిపైన ఆధారపడివుంటుందో, చిరకాలానుభవమువలన ప్రతి మాతృదేవికీ బాగా తెలిసివుంటుంది.

అది కోరవడినవారికి పైవివాహాలలాంటివి శాంతిసౌఖ్యాలకు ఎంత దూరంగా వుంటాయో లోకము చూపుతూవుంటుంది.

అందుచేత వారు తమ కుమార్తెకుగాని కుమారునికిగాని వివాహము చేయవలసివచ్చినపుడు స్వార్థాన్నంతా బైటకు సాగనంపి, అనుభవముగలవారి మాటలను ఆదరించి, వారి భావిజీవితము శాంతిసౌఖ్యాలతో నిండిఉండేటట్లు చేయవలెను.

వివాహవిషయాల్లో బేరాలు—డబ్బిచ్చి అల్లుని కొనడముగాని, డబ్బు తీసికొని కొడుకును అమ్మడము గాని—పాపపూరితాలని గ్రహించవలెను. వారెప్పుడీ నిశ్చయాలకు వస్తారో ఆక్షణమే ఈ దురంతాలు కట్టుబడిపోతాయి. ఇట్టి ప్రకటనలు అంతరిస్తాయి.

దురదృష్టవశాత్తున తమ కుమార్తెల కేదో లోపము వుందనుకుందాము. అప్పుడు కూడా పై తీర్మానాలు పనికివస్తాయా అంటే—పనికి వస్తాయి.

ఉన్నా లేకపోయినా మనము శరీరసౌందర్యానికి దేవులాడుతాము. కాని ఆత్మసౌందర్యాభివృద్ధికోసరము కొంచమైనా ప్రయత్నించము. సాధనవల్ల సద్విద్యవల్ల సంస్కారమువల్ల అది ప్రతివారికి తప్పకుండా అలవడుతుంది.

సత్యముమీద పవిత్రతమీద నిలువబడిఉన్నతగుణాలన్నీ ఆత్మసౌందర్యానికి కారణాలవుతూవుంటవి. సంతానముయొక్క భావిసౌఖ్యము కోరే ప్రతి మాతృదేవీ దానికై ఎక్కువగ ప్రయత్నింపవలెను.

# మడి - మైల

విద్వాన్ శ్రీ విశ్వనాథనరసింహంగారు, బి. ఏ. బి. ఇడి.

మడి కట్టుకొని భోజనం చెయ్యాలని ఓ నీమం పెట్టుకున్నారు ఆర్యులలోని కొందరు. బాపనయ్యల మడిభేదాలు పలువిధాలుగా వుంటున్నాయి. తెలుగు మడి ఓ రకం. అంటే స్నానంచేసిన తరువాత ఎండలో తడిపి కట్టిన దోవతి కట్టుకొని మరీ భోజనానికి పోవాలి. ఉదికిన మడుగు దోవతులు ప్రవరుని శిష్యులు ఆయన వెనుక తీసుగు వచ్చినట్టుగా పెద్దన్నగారు సెలవిచ్చేరు. కొంతమందికి అందులో కొంత సూక్ష్మం కావలసి వచ్చింది. నారపొత్తు పంచలంటూ వచ్చేయి, అవి తడుపుగో నక్కర లేకుండానే మడి. పొత్తుపంచలు_అందులో బరంపురం పొత్తుపంచలు ప్రసిద్ధం_కూడా అదే మాదిరిగా మడి. ఈ రెంటిపైనా వున్నాయి పట్టు పంచలు. సాధారణంగా వివాహాల్లో వాటివాడుక హెచ్చుగా వుంటుంది. చాల కాలం నుంచిన్నీ యీ పట్టునేత పన్లు విస్తారంగా బరంపురంలో జరుగుతున్నాయి. అవే ఆంధ్రదేశమంతటా ప్రచారం పొందేయి. పట్టుదోవతి ఒకటివుంటే మరి బాధలేదు. ఇంక ఆ దోవతి యెప్పుడున్న మడిగానే వుంటుంది. అది కంపుకొట్టినా ఏసంవత్సరానికేనా ఓసారి చలవకి వెయ్యరు, చినిగిపోతుందేమో అని భయంచేత.

ఇక చంటిపిల్లల మడి వేరు. పెద్దవాళ్ల మడి వేరు. చంటిపిల్లల తల్లులయితే వారిది వేరొక మడి, కొన్ని సౌలభ్యాలు వాళ్లకి కల్పించేవారు పెద్దలు. పళ్లురాని పసికూన ఎల్లప్పుడున్నా మడిగానే వుంటుందని పెద్దముత్తయిదువలు తీర్పుచేశారు. ఇంతకూ వితంతువులకోసం ప్రత్యేకమయిన మడి కల్పితం అయివున్నాది. సాధారణంగా కుటుంబాల్లో మడి విషయమైన తగాదులు తీర్చటం అనేది వారిహక్కు_ ఆధీనాల్లో వుందని చెప్పవచ్చు.

అయితే వారి మడిలో అనేక రకాలు న్నాయి. కార్తిక మాసంలో మడి ఓలాగుంటుంది. తొలినాటి సాయంకాలం ఉదికి ఆరవేసిన జామారు__వితంతులు ధరించే శ్వేతవసనానికి ఆ పేరు—అల్లా కొయ్యనుండగా తెల్లవారుజామున లేచి కాల్యకృత్యాలు శీఘ్రంగా ముగించి రెండు చేదల నీళ్లు నూతిలోవి తోడుకొని తలమీద వెన్నుమీదపోసే సు గు ని రు య్య మ ని గా లి పీ చే స రి కి గజగజలాడుతూ ఆజామారు కట్టుగోవటం. మాఘమాసంలో మడి మరొకమాదిరి. అప్పటికి చలికొంచెం వెనక పడుతుంది. మడిని కోరు వితంతువులున్నా తదితరులున్నా కూడా మాఘస్నానాలు చెయ్యటానికి దగ్గరగావున్న ఏటికో, చెరువుకో, వేకువనే ప్రయాణమయి స్నానానంతరం ఆ తడిబట్టలతోనే ఇండ్లకు వచ్చేసరికి ఆయా వస్త్రములు కొంచెంగా తడి ఆరుతాయి. వేసవిలో మడి మరొక రీతిగా వుంటుంది. తడవ తడవకున్న మైల పడామని స్నానం చెయ్యడంతోటే సరిపోతుంది వారిపని. కేవలం తడిబట్టలు కట్టు

గుంటేనే కాని అప్పట్లో అంటే గ్రీష్మకాలంలో మడి దక్కనే దక్కదు. ఇంకా అటుకులమడి ఆవకాయమడి, పప్పులమడి అప్పడాలమడి అరిశలమడి బొరుగులమడి ఇవన్నీ మరికొన్ని అంతర్భేదాలనిన్నీ వీటన్నిటికిన్నీ ప్రత్యేకమైన ఆచారాలున్నాయనిన్నీ తెలుసుగోవాలి.

తరువాత ఆంధ్రుల మడికిన్నీ అరవ సోదరుల మడికిన్ని చాలభేదం కనిపిస్తుంది. అరవలకి స్నానంతోటి అంతాశుద్ధి. ఎప్పటిదప్పుడే "ప్రతి ముచ్యతే" అవుతుంది. తదుపరి ఓదోవతీ అంటే గూడకట్టుది లేక చీరె కట్టుగుంటారు. అది మరునాటివరకున్నా అల్పాచి మానాధికాచిమానాలు దాన్తోనే చేసినా మడిగానే ఎంచబడుతోంది, అంటే భోజనాదిక్రియలు నిర్వర్తించవచ్చు. కాబట్టి వారిమడి వీరికి సరిపడదు. ఇంకా ఓఢ్రుల మడి వేరు, కన్నడం వారిదోరకం మడి. మహారాష్ట్రులు వగైరాలలో మడిభేదాలనేకంగా వుంటాయి.

"మడిదున్నక బ్రతుకమేలు" అని వేమన నీతి వచనం కనబడుతుంది. కృషికుడు పొలాన్ని దున్ని మడిచేస్తాడు.

మడికానిదే మైల అని ఒక అభిప్రాయం. మడిగావున్నప్పుడు ఎవరినైనా తాకితే మైలపడిపోతారు, ఆ మట్టుగున్న మడివాళ్లు. అందులోను అన్నం తింటూన్నప్పుడు మడుగు లేని వాళ్లని—మడి అనటానికి మడుగు అని కొందరు వ్యవహరిస్తారు—తాకితే వెంటనే లేచి పూర్తిగా స్నానం చెయ్యవలసి వుంటుంది. ఇంతేకాక కొందరు ఛాందసులైన మడివాళ్లు కొంతమందిని చూస్తేనే మైలపడతారు. అంటే "హరిజనుల"ని చూడరాదట మడివాళ్లు. అట్లా చూచుట తటస్థిస్తే శీఘ్రంగా కట్టుబట్టలతో స్నానం చెయ్యాలి. స్పర్శ అయిందంటే శిష్టులయిన పురుషులకు నూతన యజ్ఞోపవీతధారణంతో గాని వారి మైలపోదు. ఇప్పటికిన్నీ అల్లాగే చేస్తున్నారు కొంతమంది అగ్రహారస్థులు. అయితే వాళ్లుకూడా పట్టణాల్లోకి వచ్చేరంటే కొంత మార్పుతో నడుచుకొంటారు. కూడు కుడుస్తూన్నప్పుడు శూద్రులు కనబడితే మైలపడిపోతారు కొంతమంది. ఆ వెంటనే వారు భోజనం విసర్జించి స్నానాదికము లొనర్చి ఆచమనం చెయ్యాలి. వనసంతర్పణల్లో దవ్వుల శూద్రులు గోచరించినా దోషంలేదని విశేషన్యాయం వకటున్నాది. ఆప్రకారంగానే తీర్థయాత్రల్లో నడుచుగుంటారు శిష్టులయినవారు.

శవదర్శనం అయిందంటే సచేలస్నానం విధించబడిందని కర్మిష్ఠుల వచనంగా కనిపిస్తూంది. అల్లా చేస్తేనేకాని మడికాదు. ఇంకా శౌచవిధులలో అనేక విధాలుగా మైలవిషయం పుట్టుట గిట్టుటలు సంభవించినప్పుడు—జాతాశౌచ మృతాశౌచములు—నిర్దేశించబడివుంది. ఎవరో ఎక్కడో ఎన్నిమైళ్ల దూరంలోనో చనిపోయిన సన్నిహిత బంధువులకు ఆవార్త విన్నవెంటనే మైల తగుల్తుంది. ఇదేమి వైర్‌లెస్‌లాగుంది అని కొందరు సందేహించి ఆయా విధానములను

[602-వ పుట చూడుడు]

# విదుషీమణి డాక్టరు సి. మీనాక్షి, M.A., Ph.D.

శ్రీమతి కె. యశోదాదేవిగారు, బి. ఎ. (ఆనర్సు)

పాశ్చాత్యదేశములు అనాగరికములైయున్న సమయమున సర్వవిషయములందును అత్యున్నతస్థానమ నధిష్ఠించియున్నది మన భరతదేశము. మానవమండలికి సమస్తవిద్యలయందును మార్గదర్శకరై అత్యంత ప్రాచీనకాలమునుండియు నలరారుచుండినది మన భారతవర్షము. మన దేశచరిత్రమును గాంచిన వేదవేదాంతములు; ఆయుర్వేదధనుర్వేదములు; జ్యోతిష, గణిత, చారిత్రక, రాజనీతి, వాఙ్మయములు మొదలగు సర్వవిద్యలయం దారితేరిన విదుషీమణు లెందరో గానవగుదురు. వారి చరిత్రములు భారతజాతీయధారయందు దేదీప్యమానముగ బ్రకాశించుచున్న వనుట యతిశయోక్తి కాదు గదా. వేద ఋక్కులయందు కొన్ని విశ్వవర, మదాలస, మధురవాణి, గార్గి, మైత్రేయి మొదలగు నారీమణుల రచితములనుట విద్వజ్జనవేద్యము. ఉద్దండపండితసభలలో వాగ్వాదముల బాల్గొని విజయలక్ష్మిని గైకొన్న స్త్రీలు ప్రాచీన భారతవర్షమున నెందరోయుండిరి. ఆనాటి సుప్రసిద్ధ జైన బౌద్ధ విశ్వవిద్యాలయములయందు విద్యార్థినులు పెక్కురుండినటుల బౌద్ధ జైన వాఙ్మయములయందు గాంచుచున్నాము. వీరాంగనలగు సంయుక్త, దుర్గావతి, సుల్తానారజియా, రుద్రమదేవి, తారాబాయి, లక్ష్మీబాయి, అహల్యాబాయి మొదలగు మహారాణులును, గణితశాస్త్రమును రచించిన లీలావతి, వరదాంబికాపరిణయకర్త్రియగు తిరుమలాంబిక, మధురావిజయరచయిత్రి గంగాదేవి, మొల్ల, మోహనాంగి మొదలగు నారీమతల్లుల నామధేయములును భారతజాతీయ చరిత్రధారయందు దేదీప్యమానముగ వెలుంగుచున్నవి.

ఆధునికకాలమున విశ్వవిద్యాలయవిద్యయే యున్నతవిద్య. పాశ్చాత్యదేశ విశ్వవిద్యాలయముల ఆదర్శముపైననే మనదేశమందలి విశ్వవిద్యాలయములు నిర్మింపబడినవి. స్త్రీలకు ప్రత్యేక విశ్వవిద్యాలయములు లేకున్నను, ప్రత్యేకకళాశాలలు మాత్రమచ్చటచ్చట గలవు. పట్టభద్రలైన స్త్రీలసంఖ్య క్రమేణ పెంపొందుచున్నది. వీరిలో గొందరు రాజకీయ, మత, సాంఘిక విషయములందు బాల్గొనుచున్నారు. సరోజినీదేవి, సరళాదేవి నామము లెరుగని భారతీయులుందురు గదా! విజయలక్ష్మి, రుక్మిణమ్మగార్ల పేర్లు నారీలోకమునకు చిరపరిచితములు. ఇటీవల తిరువాన్కూరు సంస్థానమున సర్జనుజనరలు హైకోర్టుజడ్జి పదవులకు స్త్రీలు నియమింపబడిరను వార్త నారీలోకమును సంతోషతరంగముల మంచివైచినది. కాని అత్యంతకఠినమైన పరిశోధనలజేసి క్రొత్తవిషయముల గనిపెట్టిన విదుషీమణులు భారతవర్షమందు కానరారు. బహుకఠినమైన పరిశోధనలొనర్చి, మద్రాసు విశ్వవిద్యాలయముచే డాక్టర్ (Ph. D.) పట్టమును బొందిన విదుషీమణి సి. మీనాక్షి. ఈమె మన మద్రాసు ప్రసిడెన్సీయందు మొట్టమొదట డాక్టరు పట్టమును బొందిన నారీమణియగుటవలన నామె పరిచయమును ఆంధ్రలోకమునకు కలిగించుట కెంతయు సంతసించుచున్నాను.

శ్రీమతి సి. మీనాక్షి ద్రావిడ బ్రాహ్మణయువతి. ఈమె పూర్వికులు దాదాపు 350 సం. నుండి చెన్నపట్టణ కాపురస్థులు. ఈయమ తండ్రి మద్రాసు హైకోర్టులో మేనేజరుగానుండి యాయన జీవితమును సర్వవిధముల గణ్యతగ గడిపియుండెను. ఈమె జనని తమిళము, తెలుగు, సంస్కృత భాషలందు చక్కని జ్ఞానముకలిగి, పూర్వసాంప్రదాయముల నీడక, నిరంతరము దైవభక్తి, పారమార్థిక చింతలయందు మునింగి తేలుచుండును. ఈమె సోదరుడే తిరువాన్కూరు విశ్వవిద్యాలయ ప్రోవైసు ఛాన్సలరు సి. వి. చంద్రశేఖరనుగారు. మద్రాసు క్రైస్తవ కళాశాలలో జంతుశాస్త్ర పండితులైన

(Professor) సి. లక్ష్మీనారాయణగారు మన మీనాక్షికి సోదరుడు.

అట్టి విద్వత్కుటుంబమునందు జన్మించిన కుమారి మీనాక్షి బాల్యమున నింటియందే విద్యాభ్యాసము నొనర్చెను. పదునొకండు వర్షముల వయస్సునందే సంగీతమందు మంచి పాండిత్యమును సంపాదించి 1918లో రాజధాని ట్రయినింగు పాఠశాలలో ప్రవేశించినది. 1925లో స్కూలుఫైనలు పరీక్షయందు కృతార్థురాలై స్త్రీల క్రైస్తవ కళాశాలలో జేరెను. ఇంటర్మీడియటులో నీమె యభిమానవిషయములు (Optional Subjects) చరిత్ర, సంస్కృతము. అప్పటికే యీమెకు హిందూదేశచరిత్రమున బరిశోధనల గావింపవలయునను అభిలాష మిక్కుటముగనుండెడిది. 1927లో నింటర్మీడియటు పరీక్షయందు ఉత్తీర్ణురాలై బి. యే. తరగతిలో బ్రవేశించి చరిత్రను యభిమాన విషయముగ జదివి, 1929లో పట్టభద్రయయ్యెను. అదే వర్షమున క్రైస్తవకళాశాలలో యమ్. యే.లో బ్రవేశించెను. ఈ పరీక్షయం దీమెకు అభిమానవిషయములలో ముఖ్యమైనది విజయనగరచరిత్రము. ఇది యీమెకు పరిశోధనల జేయుటయందుగల యభిలాషను మిక్కుటముగ పెంపొందించెను. 1931లో 2వ తరగతిలో యమ్. ఏ. పట్టము బడసెను.

మన దేశచరిత్రమున బరిశోధనల జేయవలెనను శ్రీ మీనాక్షి మనోరథ మీడేఱుదినములు సంప్రాప్తమాయెను. యువతులకు పరిశోధనాశాఖల (Research Departments)లో ప్రవేశమునిచ్చుటకు మద్రాసు విశ్వవిద్యాలయము బంకించుండెను. కాని యా దినములలో నీమె బహుప్రయాసకు లోనై సీటును సంపాదించి హిందూదేశచరిత్రము, ప్రాచీన వస్తుశాస్త్రముల శాఖలో (Department of Indian History and Archeology) పరిశోధనావిద్యార్థిని (Research Student)గ జేరెను. సుప్రసిద్ధ చారిత్రకవేత్తయగు ప్రొఫెసరు శ్రీ కె. ఏ. నీలకంఠశాస్త్రిగారి యాధిపత్యమున 1931నుండి 1935వరకు "పల్లవుల కాలమందలి రాజ్యపరిపాలనము, సాంఘికజీవనము, కళ" (Administration, Social life and Art under the Pallavas) అను విషయమున బరిశోధనల గావించెను. ఈసందర్భమున శ్రీ మీనాక్షి ప్రాచీనకట్టడములను, శాసనములను బరిశోధించుచు మన కృష్ణాతీరమందలి వుండవిల్లి, మొగల్రాజపురము, విజయవాడ, కొండపల్లి, మంగళగిరి మొదలగు స్థలముల కరుదెంచి గుహాలను దేవాలయములను బరిశీలించియుండెను 1935 సం. నవంబరు మాసమున డాక్టరు (Ph. D.) పట్టమునకై పల్లవులపై తనగ్రంథమును వ్రాసి (thesis) బంపెను. 1936 సం. యేప్రియల్ లో డాక్టరు పట్టమును బొందెను.

చిరుతవయస్సునుండియు పరిశోధనల నొనర్ప నీమెకుండిన యఖండ భక్తిశ్రద్ధలు, ఫలించినవి. 1937 సం.లో మద్రాసు విశ్వవిద్యాలయమున, నదే పరిశోధనాశాఖ Research Fellow గా జేరి ఆచార్య శ్రీ నీలకంఠశాస్త్రిగారి (Professor of Indian History and Archeology) యాధిపత్యము క్రిందనే "దక్షిణ హిందూదేశము, బౌద్ధమతము" (Buddhism in Southern India) అను విషయముపై పరిశోధనల గావించి 1938 లో పూర్తిచేసెను. ఈమె తన పరిశోధనలవలన కనిపెట్టిన ముఖ్యవిషయములు "కాంచీపురమందలి పల్లవరాజ రాజభవన శిథిలభాగములు" (Possible remains of Pallava Palace at Conjeevaram) "మన్నారుగుడిలోని బౌద్ధమత కేంద్రము" (A Buddist Centre at Mannargudi) అనునవి. ఈమె పల్లవులపై రచించిన సుప్రసిద్ధగ్రంథరాజము (thesis for Ph. D.) మూడుభాగములుగ బ్రచురింపబడ నున్నది. మొదటిభాగమును మద్రాసు విశ్వవిద్యాలయమువారును, మిగిలిన రెండుభాగములను ఇండియా ప్రభుత్వమువారును బ్రచురింపనున్నారు. శ్రీ మీనాక్షి బౌద్ధమతమునుగూర్చి వ్రాసిన గ్రంథముగూడ త్వరలో బ్రచురింపబడి విద్వాంసుల కరకమలములయం దలంకరింపనున్నది.

శ్రీమతి మీనాక్షికి సంస్కృతమునందే గాక ఆంధ్రమునందును చక్కని జ్ఞానముగలదు. ఈమె

మంచి రచయిత్రి; వక్త. వయస్సు ముప్పదివత్సరములు మాత్రమే. అవివాహిత. పెక్కు స్థలములందుపన్యాసములనిచ్చి బొగడ్త గాంచియున్నది. అనేక విమర్శలను, ఉపన్యాసములను రచించియున్నది. మద్రాసు రోటరీక్లబ్బు మద్రాసు ఆర్కియాలాజికల్ సొసైటీలయందు ఉపన్యసించెను. మద్రాసు, ఆంధ్ర, అన్నామలై విశ్వవిద్యాలయ కళాశాల (extension) లయందు ఉపన్యాసములను, పల్లవులు, తమిళవాఙ్మయము, మొదలగు విషయములపైని నొసంగియున్నది. మోడరన్ రివ్యూ, కల్యైమగల్, కరెంటు థాట్సు (బెంగుళూరు), ఓరియంటల్ రిసర్చి జర్నలు (మద్రాసు) బెంగుళూరు మిథిక్ సొసైటి జర్నలు, న్యూ రివ్యూ, యిండియన్ హిస్టారికల్ క్వార్టర్లీ (కలకత్తా) లలో నియమరచితములైన వ్యాసరాజము లనేకములు ప్రకటితములు. శ్రీ మీనాక్షి చేసిన ప్రాచీన వస్తుశాస్త్రము, ఎపిగ్రఫీ, చరిత్రగ్రంథ విమర్శనములలో రామశంకర త్రిపాఠీగారి కనౌజదేశచరిత్ర, అత్మిరుమీవారు దేశచరిత్ర, యస్. వి. చౌదరిగారి మహెంజొదారొ యందలి వ్యవసాయము, Vijianagar sex-centenary volume Annual Report on South Indian Epigraphy for 1933 మొదలగు గ్రంథములు గలవు.

గత డిశంబరులో తిరువనంతపురములో జరిగిన అఖిలభారత ప్రాచ్యసభలలో (All India Oriental Conference) వ్యాసమును (Paper) జదివి, ఉపన్యాసమిచ్చి విద్వాంసుల మెప్పు వడసిన నారీమణి శ్రీ మీనాక్షి. ఈమెను యిండియా ప్రభుత్వమువారు వైకుంఠపెరుమాళ్ శిల్పములగూర్చి వ్రాయుటకు నియమించియున్నారు. ఇటీవల నీయమ దక్షిణదేశ సంగీతమునుగూర్చి తమిళమున రేడియో యుపన్యాస మొసంగియున్నది. ఇంత చిన్నవయసునందే భారతవర్ష విద్వన్మండలియందు పేరు ప్రఖ్యాతుల గడించిన యీ విదుషీమణికి గొప్ప భవిష్యత్తు గలదనుట నిస్సంశయము. ఇంకను నీమె తన పరిశోధనల ద్వారా మన దేశచరిత్రమునకును, దేశీయ వాఙ్మయములకును, కళలకును అపారమైన సేవ జేయు నని నమ్మెదము.

ఇట్టి నారీమణిని యాదర్శప్రాయముగ గైకొని విద్వాంసురాండ్రగు భారత లలనామతల్లులు తీవ్రోత్సాహము, పట్టుదలతోడ భారతీయ పురాతన సంపదను వెలువరించి మానవకల్యాణమునకు దోడ్పడుదురు గాక. (631-వ పుట చూడుడు)

---

అతిక్రమించేరు. ఇంకా కొంతమంది ముందంజవేసిన వాళ్లు—బ్రహ్మ సమాజం బయల్దేరిన తరువాత లెండి—చచ్చిపోయిన వాళ్లు మనల్ని చూస్తారా, మనం తిలోదకాలు ఎందుకీయటం, సంవత్సరాని కోసారి వారిపేరుగా పనిలేని బాపనయ్యలకు భోజనాది సదుపాయములు చెయ్యటం అని విడిచిపెట్టేరు ఆయా కర్మలను. అయితే ఏ అమెరికా దేశస్థుడో, సూక్ష్మ శరీరంలో జీవులు కొంతకాలం వుంటున్న సంగతిన్నీ, వానితో మాట్లాడే విధానం వగైరాలు నూత్నంగా కనిపెట్టేరనే విషయమున్ను, మనకు సంవత్సరం కాలం తిరిగేటప్పటికి సూక్ష్మశరీరధారులగు పితృదేవతలకు ఒక్క దివసమవుతుందనిన్ని, తెలుపుడుచేసి వున్నాం కట్టుకున్నాడు. అల్లా వారినోటంట వచ్చిన వేదవాక్యములకు హెచ్చువిలువ కలిగింది. కొంతమందిలో పూర్వాచారం దృఢపడింది.

అయితే మడుగు విషయంలో చెప్పాల్సిందేమంటే బాహ్యశుద్ధికొరకు అవన్నీ యేర్పాటు చేయబడినవనే విషయం చాల యుక్తియుక్తంగా కనిపిస్తుంది. బాహ్యశుద్ధి వుంటేనేగాని అంతరంగానికి నిలుకడ వుండదనిన్నీ, అంతశ్శుద్ధికి బాహ్యమైన స్నానాదికములు తోడ్పాటు అవుతవనిన్ని ఎంచుకోవచ్చును. స్నానాదికములవల్ల శరీర స్వచ్ఛత సంభవిస్తుంది. బాహ్య శరీరం శుద్ధంగా వున్నప్పుడు అంతరంగం నిలుకడగా వుండటానికిన్నీ తద్వారా మనస్సమాధికిన్నీ వలనుపడునని పూర్వుల అభిప్రాయం.

# స్త్రీల అభ్యుదయము - రచనలు

శ్రీమతి మో. మాణిక్యాంబగారు

భగవంతుని సృష్టిలోని స్త్రీ పురుష భేదాలు సృష్టి నిమిత్తమయ్యేగాని ఆత్మికంగా గాని నైతికంగా గాని భేదాలంటూ లేవని పక్షపాతరహితమైన భావానికి గోచరిస్తూనే ఉంటుంది. బండినడిపించే 'గాడీవాలా' రెండెద్దుల్ని సమదృష్టిలోనే ఉంచుతాడు. కాని బండిలాగే ఎద్దులు ఒకదాన్ని మించి ఒకటి ముందుకు పరుగెత్తుదామన్నా 'పైన నేనున్నానోయ్ వెఱ్ఱి వెధవాయిల్లాలా' అంటూ సావధానపరుస్తూనే ఉంటాడు గాడీవాలా. ప్రకృతిలోని ఏ ద్వంద్వమును చూడండి తమతమ స్వంత ప్రవృత్తులతోనే జీవితాన్ని నడుపుకుంటూంటాయి. కాని జంట విడవవు. అదిగాక ఒకదాన్ని ఒకటి అనుకరించడం అనేవికూడా సృష్టిలోని ఒకవిచిత్రమే. దానికి చీమలబారు, కొంగలబారు తార్కాణం. ఈ రీత్యానే జాతి, మత, సంఘ విభజన ఏర్పడుతూంటాయి. ప్రతి ప్రాణి స్వంతకాళ్లమీాద నిలబడ్డా ప్రేమబంధన అనే భగవంతుణ్ణి ఉల్లంఘించ లేకపోతున్నాయి.

ఇట్టి పరిస్థితుల్లో మహోత్కృష్టమయిన మానవజాతి 'యీాలా రమ్మంటే యిల్లంతా నాదన్నట్టు' నాకేగద సర్వశక్తులు యిచ్చాడని దేవుణ్ణికూడా ఉల్లంఘింప చూచిందనటానికి, స్త్రీజాతిని చేతనావిహీననుగా చేసిన పురుషజాతియే తార్కాణం. పౌరాణికంగా వచ్చే పురుషనిర్మిత ధర్మ, మత, ఆచార నిబంధనల పరిణామాన్ని ఆత్మికంగా పరిశీలిస్తే అవన్ని పురుషజాతి మత స్వార్థపతాకాన్ని స్వేచ్ఛగా ఫహరాయించడానికి చేసిన పన్నుగడలని అవగాహన గాకపోదు.

"సత్యమే జయం" అన్నట్టు సత్యం ఎంతవఱకు దాగగల్గుతుంది? అగ్నిని బుట్టతట్టల్లో దాచడం ఎవరితరం? శక్తి స్వరూపిణి స్త్రీలోకంయొక్క వేడి కన్నీటిధార ఏమవుతుంది? మకరికరమున చిక్కిన కరి మొరను "అలవైకుంఠపురం" అడ్డగల్గిందా? రాక్షసకృత్యాలచే, తపించిన భూదేవి హృదయావేదనేగా, కృష్ణావతారాన్ని భూలోకాన్ని దింపింది? ఈ కలియుగంలో, ఆ స్త్రీ హృత్తాపమే, రాజారామమోహనరాయ్, శ్రీ వీరేశలింగం పంతులు, శ్రీమతి ఆనిబిసెంటమ్మ మొదలగు అవతారమూర్తుల్ని భూలోకంలో ఉద్భవింపచేసింది అంటే అందులో అత్యుక్తుం దంటారా? వారి సింహగర్జనలే, పురుషజాతిని మేల్కొలిపింది వారి దయారస వెల్లువ మానవజాతియొక్క హృదయక్షేత్రం మీాదుగా పారింది. దానికితోడు సత్యపూజారి మహాత్మాగాంధీగారి స్వతంత్ర శంఖారవం దశదిశల మాఱుమ్రోగింది. తేరిపార చూచుసరికి

దీనవదనయైన స్త్రీలోకం దృక్కోణానికి తగిలింది. శృంఖలాబద్ధయై, మృత శరీరయైన భరతమాత యొక్క అశ్రుమిశ్రిత జాలిదృక్కులు హృదయాన్ని చీల్చివేసినవి. ఆమె యీదశకు తానే కారణభూతమని ఆత్మతంత్రులు మ్రోగాయి. తనసాటిజాతి అధఃపతితయై, కళావిహీనమగు చంద్రుడిలా, సుగంధరహితయైన పుష్పములా సారహీనమై పడి ఉంటే హృదయమనేది కరక్కుండా ఉంటుందా? ఆత్మకు ఆత్మయే సాక్షి, గంభీర ఆలోచన ద్వారానేగా ఆత్మయొక్క లోతులో "సత్యం" దొరుకుతుంది? పశ్చాత్తాప కన్నీటితో మనోమాలిన్యాన్ని తుడుచుకొంది. మరుగునున్న మానవోద్రేకం విజృంభించింది. "స్త్రీలభ్యుదయం, స్త్రీలభ్యుదయం" అంటూ కళవళపడింది పురుషజాతి. స్త్రీ విద్యాలయాలు, అనాధశరణాలయాలు మొదలైనవి యేర్పడ్డాయి. స్త్రీలోకం కొంచెం కళ్ళు తెరిచింది. సరే స్త్రీల అభ్యుదయం కొంచెం తల యెత్తిందనవచ్చు.

'లేనిబావకంటే గుడ్డిబావ మెఱుగని' స్త్రీలభ్యుదయం అనేది బయలుదేరిందని సంతోషించినా ఆవుద్రేకంలో "అతి" అనే దానివల్ల కొన్ని విషమపరిస్థితు లేర్పడ్డాయి. 'యథారాజా తథాప్రజా అన్నట్టు' స్త్రీలలోకూడా పాశ్చాత్య ప్రాతినిధ్యం పెచ్చు పెరిగింది. భాషయే సంఘానికి జీవం గనుక, బాషపూర్తిగా పట్టుపడక పోయినా దాన్నించొచ్చే నాగరికతా సూత్రాలు స్త్రీలోకంలో ప్రతిఫలించి తనదానిగా చేసుకున్నాయి. తప్పించుకు పారిపోదామని గిజగిజా కొట్టుకొన్ని కొద్దీ మరికాస్త చిక్కుపడుతుంది వలలో పక్షి. శుష్కించిన నదీప్రవాహం వరదరూపం దాలుస్తే చుట్టుప్రక్కల ప్రదేశాన్ని ముంచేయక ఊరుకుంటుంది? మబ్బువిడిచిన యెండ ప్రకాశవంతంగా ఉన్నా తీక్షణంగా ఉంటుంది. పథ్యం పెట్టేటప్పుడే కొత్త చింతకాయ పచ్చడి వేస్తే జ్వరం రెట్టిస్తుంది. లేనిబావ లేకపోగా గుడ్డిబావని మెడకంటుకుంటే వాడితో కూడా, గుడ్డిదానిలా యిదికూడా నడవాలి. బాబుకి పెళ్ళవుతుందనే సంతోషమేగాని, సవితల్లి వస్తుందనేమి తెలుసును ఆ ముగ్ధహృదయాలకు? ఏదేశాన్నుంచో, మనకి స్వతంత్రం వచ్చిపడుతుందనేగా పాశ్చాత్య పాశంలో చిక్కుకుపోతూన్నామని గమనించలేక పోతూంది స్త్రీలోకం. చదవేస్తే ఉన్నమతీ పోయిందన్నట్టుగా తేలింది స్త్రీలభ్యుదయం యొక్క అత్యాందోళనా పరిణామం చివరికి.

ఆత్మికంగా చూస్తే "పెళ్లి" అనే సాంఘికసమస్య స్త్రీని యెదుర్కొంటోంది. ఆర్థికంగాచూస్తే యిరుపార్శ్వాలా 'లౌక్యం' తాండవిస్తూంది. శారీరకంగాచూస్తే స్త్రీ పురుషుని సుఖానికి పనికి వచ్చే ఒక యంత్రం అయి కూర్చుంది. యిదీగాక వేషభాషలు స్త్రీని "గబ్బిలం" వలె తయారు చేశాయి. ఈ కారణంవల్ల సహృదయమగు స్వతంత్రస్త్రీవ్యక్తినికూడా ఒకవింత పశువులా చూస్తోంది లోకం. ఒక విలాస

బొమ్మలా పత్రికలలో ఎక్కింపబడుతోంది. నాలుగు యింగ్లీషుముక్కలు నేర్చుకున్న స్త్రీ, ఆమె ఫేషన్ ఆమె "లా" ప్రేమలోని హావభావాలు వర్ణిస్తూ చివరికి ఒక కళ్లెం లేని గుఱ్ఱంలా ప్రకటిస్తున్నాయి. పత్రికల్లోని రచనలు, స్త్రీలభ్యుదయమే దేశాభ్యుదయం అని స్వతంత్రసమరం ఘోష పెడుతూండే యీరోజుల్లో, స్త్రీ స్థానం యిలాంటి పరిస్థితుల్లో ఉండాలంటే దాన్ని స్త్రీలభ్యుదమే అనాలో "స్త్రీల అభాగ్యమే" అనాలో అర్థం అవడంలేదు.

మనో వైశాల్యతయే మానవాభ్యుదయానికి ముఖ్యసూత్రం. జన్మ హక్కుల్ని గుర్తించే శక్తి దానిమీదే ఆధారపడి ఉంటుంది. విశాలత్వంలో ఉన్న ప్రతివస్తువు వృద్ధిగానే ఉంటుంది. ప్రవహించేనీరు, మైదానపుగాలి, విశాల ప్రదేశంలోని మొక్కను ఉదాహరణగా తీసికొంటే మనస్సుకూడా, యెంత విశాలత్వంకావాలో తేల్తుంది. ఆలాటి మనోభివృద్ధియే స్త్రీలభ్యుదయానికి ముఖ్యసూత్రం, మొదటి మెట్టూను. కాని స్త్రీహృదయం, మురికిగుంట యిరుకులోని మొక్కలయినప్పుడు యింక వృద్ధి అనేది యెల్లాంటిది ? ఈవృద్ధికి అసలు చుక్కాని పురుషుని చేతుల్లో ఉండంటే అందరూ నమ్మాలి. కాని యింతవఱకు పురుష సంఘం దానికి పూనుకొనకపోవడం చాలా విచారకరం. ఇప్పటికే నూటికి తొంభైమంది స్త్రీలభ్యుదయమంటే హాస్యాస్పదంగా చూచేవాళ్లేకనబడతారు. సభల్లో బల్లలు గ్రుద్ది వుపన్యాలు యివ్వబడుతున్నాయి. కాని ఆచరణ శూన్యం. తనవద్దిలోఉన్న స్త్రీ స్వతంత్ర అయింది అంటే తాను మహాపరాధి నవుతానేమో అనే భయాంకురాలు మొలకలెత్తుతూనే ఉన్నాయి పురుష హృదయాల్లో. "ఎన్నికంతులుకోసినా నాకంతెంత నొప్పిలే" దన్నాట్ట ఒక డాక్టరు మహాశయుడు. తమ రైన స్త్రీజాతిని యేలాగైనా నడుపుకొనవచ్చు. కాని ఆ నడుపుకోడానికి విశాలహృదయం దృఢనమ్మకం కావాలి. అట్టి పరిపక్వము పురుషుల్లో వృద్ధి అయినప్పుడే స్త్రీల వృద్ధికి దారుంటుంది. స్త్రీని గృహమనే కైదులో బంధించి ప్రపంచక కవాటాన్ని ఆమె దృక్పథాన్నుండి మరుగుపరచి, ఎంత ప్రేమించినా అదిరాక్షసత్వ మనిపించుకుంటుంది.

రచనాప్రభావం చాలా అద్భుతమైంది. హృదయోద్భవాలైన భావతరంగాల్ని ఢీకొన చేసేది రచనా చమత్కృతియేగా మరి. ప్రకాశవంతాలైన సూర్యకిరణాలు ఎంత యిరుకు ప్రదేశాలల్లోకైనా తమ కాంతిని సాధ్యమైనంత వరకు పోనిస్తూనేఉంటాయి. రచనా ప్రభావంకూడా ఎంతలేదన్నా హృదయకవాటం వరకైనా వెళ్లివస్తుంది. ఇంత యెందుకూ, తనమీద దృష్టిపరపినవాళ్లని తన వాళ్లనుగా చేసుకోకమానదు. "గుడ్డిలో మెల్ల"అన్నట్టు స్త్రీలు కొద్దోగొప్పోభావాలను అవగాహన చేసుకుంటున్నారు. రచనారసాన్ని చవిచూడగలిగారు. కాని నీళ్ల నువదలి పాలను సేకరించే బుద్ధిసూక్ష్మత యింకా స్త్రీలోకానికి చిక్కనందున దారి తప్పిన

పాంథుడిలా పరిస్థితి.

కాబట్టి బాహ్యంగా అంతరికంగా స్త్రీ లభ్యుదయం కావాలంటే స్త్రీత్వంతో, భారతీయత్వంతో ఉద్రేక పూరితాలయిన రచనలు చాలా అవుసరం. కింకర్తవ్య విమూఢులై బోనులోమగ్గి మలమలలాడిపోతున్న భారతసింహములను బయటకుతీసి స్వరాజ్య సమరాగ్నిలో దూకించాలంటే ఆంధ్రస్త్రీ ఆంధ్రులవాలంటే వీర, శాంతి, సత్య, దయా, శౌచములను వెల్లడించే రచనలు కావాలి. అట్లుగాక విదేశీయుల వింత తళుకు బెళుకులకు దాసులనుగాచేసే, సరాలగురాల తత్వంతో గూడిన ఆడంబరరచనలుగాదు.

త్రికరణశుద్ధిగా స్త్రీలఅభ్యుదయాన్ని కోరే సోదరసోదరీమణులందరు వ్యావహారిక భాషా యుక్తమై, హాస్యరసప్రధానమై, ఏకాంకిక, కథానిక, వ్యాసఘటనా, గేయరూపాలతో గూడిన రచనారసగుచ్ఛాలను స్త్రీ లోకానికి దయచేయాలి. పసిబిడ్డల జోలపాటల్లో లగాయితు, వివాహాది శుభసమయాల్లో స్త్రీల ఆశీర్వాదాల్లోలగాయితు కర్షకుల పొలిపాటలలోవఱకు స్త్రీలఅభ్యుదయ భావరసాన్ని నింపాలి. తర్వాత స్త్రీల హక్కు తంత్రులను మ్రోగించాలి. స్త్రీల "అహాం"ను రేకెత్తించాలి. అట్టి భావరచనలే స్త్రీలభ్యుదయాన్ని ఉద్భవింపచేసేవసడంలో పొరపాటుండదు.

## కవీ!

గగనమండలి నీలిమేఘాల గాంచి
పొంగిపోయి ప్రమోద ప్రఫుల్లడగుచు
ప్రకృతివర్ణన గావించి వైచినంత
నో కవీ! చెల్లెనే తమయొక్క బాధ్య
తలు........................ ..
......విశేషించి సతము బీదలముఖాల
వ్రేలు దారిద్ర్యమేఘాల వెన్నొ కలవు,
కలవు...వర్ణింప నెంచిన,కలవు...సుమ్ము

నీలిమేఘాలలోన శంపాలతాంగి
దర్శనమ్ముకై తపియించి, తనివహించి
కవిత గురుపింతువంతతో నవునో చెపుమ,
ఓ కవీ! తిండికల్లాడుచుండు బీద
మొగముమొయిలులశంపకై, పూనికటిక
రాతి యెడదల కరిగించు రమ్యకవన
మెందులకు చిక్కలోయి నీవేమి చేతు?

వేమూరి వేంకటరామనాథం



శ్రీమతి రాణీ లక్ష్మీబాయి రాజవాడేగారు

ఢిల్లీలో జరుగబోతూవున్న అఖిల భారత మహిళా
సభకు అధ్యక్షురాలుగా ఎన్నుకోనబడినారు.




పరనాతురత

చిత్రకారిణి: శ్రీమతి ఎస్. శకుంతలగారు

# మలబారు సందేశం

శ్రీ భావరాజు నరసింహారావు గారు

దేశాటనమనేది స్త్రీకిగాని పురుషుడికిగాని అమూల్యమైన అనుభవాన్ని, విజ్ఞానాన్ని, ఆనందాన్ని కలుగజేస్తుందనే సంగతి జగద్విదితమే! అందుచేతనే మన పూర్వులు లోకజ్ఞానం సంపాయించటానికి పర్యటనం చేయమని చెప్పారు. విద్యాభ్యాసమైన తర్వాత దేశాటనం చేసి వస్తేనే విద్య పూర్తిఅయినట్లెంచేవారట మనపూర్వులు. అల్లాగే బి. యే. పరీక్ష యిచ్చినవాళ్లకు—హిందూదేశమంతా చుట్టి రాకపోయినా—అధమం తాముండే రాజధానినంతా తిరిగివస్తేనేగాని మన విశ్వవిద్యాలయాలు బి. యే. డిగ్రీని యివ్వకుండా ఉండటం అవసరం. స్త్రీలు ఒంటరిగా పర్యటనం చేయడమనేది పూర్వం చాలా కష్టమూ, అపాయకరమూ కాబట్టి పురుషులే తిరిగి వస్తూండేవారు. ఇప్పుడు ఆ కష్టాలు చాలావరకు తగ్గాయి కాబట్టి స్త్రీలు, ఒంటరిగా కాకపోయినా, ఒక్కొక్క జట్టుగా బయలుదేరి ప్రపంచాన్నంతా చుట్టివస్తున్నారు.

అయితే పర్యటనాల్లో కేవలం 'సత్రాభోజనం మఠానిద్రా' చేసి బజార్లు, సినిమాలు చూసి రావడంతోటే సంతృప్తిపడి తిరిగిరాకుండా, మనం వెళ్లిన ప్రాంతాలలో ఉండే మనుష్యుల వేషభాషలూ, నిత్యజీవనం, వారి మనోప్రవృత్తులూ, వారి కట్టడపు అందాలూ చేతిపనులు సౌకుమార్యమూ మొదలైన విషయాలను కొంచెం సూక్ష్మదృష్టితో గమనిస్తూ తిరిగివస్తే, పర్యటనం చేసినవాళ్లకూ, తద్వారా వారి ప్రాంతీయులకూ ఎంతైనా లాభముంటుంది. అందులో ఒకచిన్న 'కెమిరా' కూడ దగ్గరుంచుకొని అందమైన ఉపయోగకరమైన దృశ్యాలను 'ఫోటో'లు తీసుకుంటూ తిరిగినట్లైతే కొంతవరకు ధనార్జన చేయడమే కాకుండా, మళ్లీ కొంతకాలమైన తర్వాత మన అనుభవాలను ఒక్కసారి జ్ఞప్తికి తెచ్చుకుని ఆనందించటానికిగాని, పర్యటనం చేయనివాళ్లకు అవి చూపి ఆనందపరచి ప్రోత్సహించడానికిగాని ఎంతో ఉపకారిగా ఉంటుంది. ఈ విధంగా—కెమిరాతో—పర్యటనం చేయుటమనేది పాశ్చాత్యులు గ్రహించి లాభం పొందుతున్నట్లు మనదేశస్థులు—అందులో నేనుకూడా ఒకణ్ణి!—యింతవరకూ గ్రహించకపోవడం చాలా శోచనీయం. ఇహముందు యీ విషయంలో మనవాళ్లు ప్రత్యేకశ్రద్ధ చూపవలసి ఉంది. పర్యటనం పూర్తిఅయిన తర్వాత ఆ దృశ్యాలను తలుచుకుని 'కెమిరా ఉంటే ఎంత బాగుండేది?' అన్న విచారం మనకు సహజంగా కలుగుతుంది.

* * *

మన విశాలదేశంలో ప్రకృతి రామణీయకమైన ప్రదేశాలు చాలా ఉన్నసంగతి మనకందరకూ—చూడకపోయినా—తెలిసిన విషయమే! వాటిల్లో మలబారుతీరంమీద ప్రకృతికి పక్షపాతం ఉన్నదనటంలో అతిశయోక్తి లేదు.

మలబారుతీరంలోను, కొచ్చిన్, తిరువాన్కూరు రాజ్యాలలోను ప్రయాణం చేస్తున్న కొత్తవాడికి ఆ ప్రదేశమంతా ఒక పెద్దతోట అనీ, అందులోనే అక్కడక్కడా చిన్నచిన్న కుటీరాలు ఏర్పాటు చేసుకుని ఆ అదృష్టవంతులు కాపురం చేస్తున్నారనీ తోస్తుంది. మన ఆంధ్రదేశంలో ప్రయాణం చేస్తుంటే సామాన్యంగా మనకంటబడేవి—ఉత్తరజిల్లాలలో—తాటితోటలూ, వరిచేలూ, వాటిల్లో కష్టపడే కర్షకులూ యిత్యాదులు; దత్తమండలంలో తిరుగుతుంటే చిన్నచిన్న రాతిగుట్టలమీద చిత్రంగా అమర్చబడినట్లుండే

రాళ్లూ, కనుచూపుమేర దూరంలో ఎక్కడా చెట్లు గాని, పచ్చని గడ్డిపరకగాని లేని నల్లని బీడుప్రదేశాలూ, ఆ బీళ్లలో అర్ధ వికసితముఖాలతో, దించుకుపోయిన ఉదరాలతో క్షామదేవతా పీడితులై హృదయవిదారక స్థితిలో కనబడే అభాగ్యులూ, కాని మలబారుదేశంలో యిల్లాంటి దృశ్యాలు మచ్చుకు కూడా కనబడవు—నిత్యమంగళం పచ్చతోరణంలాగు ఉంటుంది.

మనం మద్రాసునుంచి మంగుళూరు పోతుంటే రైలుపట్టాల కిరుప్రక్కలా ఉండే దృశ్యాలు మరవురావు. ఎడమవైపువకు చూస్తుంటే నీలంగా ఉన్న నిర్మలాకాశమూ ఆ ఆకాశంలో కలిసిపోయి యింకా నీలంగా (అట్లాంటులో సముద్రంలాగు) ఉన్న గంభీర అరేబియాసముద్రమూ— ఆ సముద్రంఒడ్డునే ఉన్న తెల్లటియిసుక—ఆ యిసుకమీద పచ్చగా కన్నుల పండువులా ఉన్న పొగాకుతోటలూ—వాటికి ప్రక్కగా కొబ్బరి, పోక, జీడిమామిడి మొదలైన చెట్లున్న పెద్దపెద్దతోటలూ—ఆ తోటల్లో కొబ్బరి ఆకులతో తయారుచేయబడిన చిన్న చిన్న కుటీరాలూ—ఆ తోటల్లో పనులు చేసుకుంటున్న మనుష్యులూ కనబడుతారు. కుడివైపున అలాగే పెద్దతోటలూ—వాటిమధ్య కుటీరాలూ—వాటికవతల చిన్నచిన్న కొండలూ—యింకా వాటికవతల క్రమేణ పెద్దవై మేఘమార్గాన్ని నిరోధిస్తూ మంచుతో కప్పబడిఉన్న పెద్ద పర్వతాలూ—వాటిమీద రైలంత వేగంగా రాకపోయినా, మెల్లిగా ప్రయాణం చేస్తున్న మేఘాలూ—చూస్తూన్నట్లో, సినీమాచూస్తున్నట్లో, కలలు గంటున్నట్లో ఉండి మనని మనమే మరచిపోతా మనడంలో వింతలేదు.

ఇల్లాంటి రామణీయకమైన ప్రకృతిసౌందర్యంలో చిత్రవిచిత్రంగా అల్లబడిన కొబ్బరిఆకులపాకలుంటాయి. ఈ పాకాల నిర్మాణం చాలా అందంగా ఉంటుంది. మనం తాటాకులు కుట్టినట్లు వాళ్లు కొబ్బరి ఆకుల్ని కుట్టరు. వాటిని చక్కగా చీల్చి అందంగా అల్లుతారు. వాటితో చిన్నచిన్నయిళ్లు—జపానువారి యిళ్లలాంటివి—కడతారు. కొన్నిటి పైన మనం 'బంగాళా పెంకు' అనే యెర్రని పెంకుల్ని వాడుతారు. ఆ యిళ్లచుట్టూ చక్కగా పేడతో అలుకుతారు. చుట్టూ చిన్నచిన్న పూలమొక్కలను పోక, జీడిమామిడి మొక్కలను వేస్తారు. సామాన్యంగా ప్రతియిల్లూ ఒకతోటలో కడతారు. ఖాళీ స్థలాలు అనేవి కనబడవు—ఎక్కడ చూసినా కొబ్బరి చెట్లే. అంచేత ఆ మలబారు తీరమంతా ఒకపెద్దతోటలాగుండి అక్కడకూడా కళ్లుకట్టినట్లుంటుంది.

*　　*　　*

ఇహ అక్కడిప్రజల విషయం—ప్రకృతి ఆ ప్రాంతంమీదనే కాకుండా అక్కడి ప్రజలమీద కూడా పక్షపాతం వహించిందంటే సత్యదూరం కాదు. ఆ శీతోష్ణస్థితివల్ల అక్కడి జనమంతా చక్కగా పచ్చగా, మిసమిసలాడుతూ సంపూర్ణారోగ్యవంతులై ఉంటారు. అంటే నూటికినూరుమందీ అల్లా ఉంటారనుకోవడం పొరబాటు. అల్లాగైతే డాక్టర్ల పస్తుండవలసివస్తుంది! అంతా కాకపోయినా ఎక్కువమంది—మన దత్తమండల దురదృష్ట సోదరుల్లాగు కాకుండా—బాగా ఆరోగ్యంగా కనబడతారు. సామాన్యంగా ఏ తోటలో చూసినా స్త్రీలు పని చేస్తూంటారు. ఆకులతో చాపలల్లటమో, కొబ్బరి పీచు విడదీసి దాన్ని మెత్తగా కొట్టడమో యిల్లాంటి పనులేవో చేస్తూంటారు. మగవాళ్లు కొబ్బరిత్రాళ్లు తయారుచేయటం, కొబ్బరికాయలు పెచ్చుతీసి, కొబ్బరి యెండవేయడం, పోకలు తయారుచేయటం మొదలైన పనులేవో చేస్తూంటారు. మొత్తంమీద అందరికీ చేతి నిండా పనిఉంటుంది. పని కాగానే అంతా యింటికి వచ్చి ఒంటినిండా శుభ్రంగా కొబ్బరినూనె పూసుకుని కోనేట్లో స్నానమాడుతారు.

*　　*　　*

ఆ తీరప్రజల సాంఘిక కట్టుబాట్లూ, ఆర్థిక, రాజకీయాది విషయాలు ప్రస్తుతం విడిచిపెట్టి వారివద్ద మనం — ముఖ్యంగా మన గృహలక్ష్ములు — నేర్చుకోవలసిన ప్రత్యేక విషయాలుమాత్రం మనవి చేస్తాను.

మలబారులోని మగవారిదగ్గరకంటే, ఆడువారివద్దనుంచి మనం నేర్చుకోవలసినవి ఎన్నో ఉన్నాయి. వాళ్లు రెండుపూటలా కొబ్బరినూనె, సీకాయివాడి శుభ్రంగా స్నానమాడతారు. పురుషుల దుస్తులకన్నా స్త్రీల దుస్తులే నిరాడంబరంగా ఉంటవి — కట్టుకోవటానికి ఒక తెల్లని పెద్దతుండుగుడ్డ; అదే మాదిరి యింకొక గోరంచు తుండుగుడ్డ, చిన్నబనీనులాంటి జాకట్టు ఆచ్ఛాదితానిపైకి ఉపయోగిస్తారు. అంతా తెల్లటి కొబ్బరి ముక్కల్లాంటి గుడ్డల్ని వాడుతారుగాని, మనవాళ్లలాగు రోజుకొక కొత్తరంగు చీర చూసి, ఆ చూసిందల్లాకొంటూ సీతాకోకచిలుకల్లాగు ఘడియకొకరంగు మార్చరు.

ఇహ నగల విషయంచూస్తే సామాన్యంగా ఎవరూ కంటికి స్థూలంగా కనబడే ఆభరణాలను వాడరు. చేతికి ఒకటి — లేకపోతే రెండు — సన్నని గాజులు; మెళ్లో సన్నని చీవాగొలుసు, ఉంటే యింకొక పొడుగుపాటి యింకా సన్ననిగొలుసు. చెవులకూ, ముక్కులకూ, తలలోనూ — ఏమీ నగలుండవు. వేలుముడివేసుకున్న దీర్ఘకేశాలలో చక్కగా రెండుపువ్వులు ముడుచుకుంటారు. ఈ నిరాడంబర వేషం సాధారణంగా కూలీ, సంసారస్త్రీల దగ్గరనుంచీ మహాసీమంతులవరకూ (ఏకొద్దిమందో తప్ప) సంతకము చేయలేని వారిదగ్గరనుంచీ పట్టభద్రులవరకూ యిదేమాదిరి! వస్తువుల ఖరీదులలో తేడా ఉండవచ్చుగాని ఆకారంలో తేడా కనబడదు. వారి యిళ్లుకూడ దుస్తులలాగే ఎంతో విలక్షణంగా నిరాడంబరంగా ఉంటవి. అసలు నిరాడంబరత్వమే వారి దీక్షగా కనబడుతుంది. వారంతా ఆ దీక్షాబద్ధులైన మహర్షుల్లాగుంటారు.

అయితే అనంతకృతంగా అతి నిరాడంబరంగా ఉన్నా, అందం విషయంలో అక్కడి సామాన్య స్త్రీలతో మన ఆంధ్రులలో అందమైనవారమనుకునే వాళ్లు సమానులు కారేమో ననిపిస్తుంది.

'మరి యిన్నివేలు ఖర్చుచేసి చేయించుకున్న నగలు పెట్టుకున్నా, యింతడబ్బూ తగలేసికొన్న చీరెలుకట్టినా మనవాళ్లు ఆకర్షవంతంగా ఉండరా?' అని ప్రశ్న రావచ్చు.

'అయితే, ఆ చీరెలూ, ఆ నగలూ వాళ్లే ధరిస్తే వాళ్లు యింకా ఎంత అందంగా ఉంటారో ఊహించుకోండి!' అనేదే ఆ ప్రశ్నకు జవాబు.

అదిచ, ఒక్కవిషయంమాత్రం గమనించాలి.

కొంతమంది నగలుగాని, చీరెలుగాని ధరిస్తే నిజంగా వాటికి అందమొస్తుంది. ఇంకా కొంతమంది వాటినే ధరిస్తే వాటివల్ల తమకు అందం రాకపోగా ఆ వస్తువుల అందంకూడా పాడవుతుంది. అలాగే కొంతమంది నగలు పెట్టుకొనక పోయినా చాలా అందంగా కనబడుతారు; కొంతమంది ఎన్నినగలు పెట్టుకున్నా వికారంగానే ఉంటారు. కారణమేమిటంటే చెప్పటం చాలా కష్టం.

అందుచేత యిలాటి విషయాలను గ్రహించటానికి గ్రహించి అలవరచుకోవటానికి ఒక్కసారి ఆయా ప్రదేశాలనూ, అక్కడి మనుష్యులనూ చూసివస్తే ఎంతన్నా ఉపయోగముంటుంది.

కాబట్టి యీ వ్యాసం చదివిన 'గృహలక్ష్మి' పాఠకులలో మాటికి ఒక్కరన్నా — ముఖ్యంగా గృహలక్ష్ములు — మలబారు పర్యటనంచేసి, మలబారు సందేశాన్ని మిగతావారికి ప్రత్యక్షంగా అందజేస్తే కృతార్థుణ్ణి, ధన్యుణ్ణి.

# తెనుఁగుతల్లి!

'ఉభయభాషాప్రవీణ' శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు

కనిపింపదే నేఁడు కాకతీయప్రాజ్య సామ్రాజ్యజాతీయ జయపతాక!
వినిపింపదే నేఁడు విద్యానగర రాజ సభలలో విజయదుందుభుల మ్రోత!
చెలగదే నేఁడు బొబ్బిలికోట బురుజుపై తాండ్రపాపయ తళతళల బాకు!
నిప్పచ్చరంబయ్యెనే నేఁడు వీరపల్నాటియోధుల సింహనాదలక్ష్మి!
చెక్కుచెదరని — ఏనాఁడు మొక్కవోని — ఆంధ్రపౌరుష మిప్పుడధ్వాన్నమయ్యె
మరలనొకమాటు వెనుకకుఁ దిరిగిచూచి, దిద్దుకోవమ్మ! బిడ్డలఁ దెనుఁగుతల్లి.
గంటానఁ గవితను గదనుద్రొక్కించిన నన్నయభట్టు లీనాఁడు లేరు
కలహానఁ గంచుఢక్కల నుగ్గునుగ్గు గావించు శ్రీనాథు లీవేళ లేరు
అంకానవాణి నోదార్చి జోలలు వాడు పోతనామాత్యు లీప్రొద్దు లేరు
పంతానఁ బ్రభువుచేఁ బల్లకీ నెత్తించుకొను పెద్దనార్యు లీదినము లేరు
'వాణినారాణి' యంచు సవాలుకొట్టి, మాటనెగ్గించు వీరులీపూట లేరు
తిరిగియొకమాటు వెనుకకు మరలిచూచి, దిద్దుకోవమ్మ! బిడ్డలఁ దెనుఁగుతల్లి!
రాజరాజుల చరిత్రల నాలపించెడి గౌతమీగద్గద కంఠరవము
ఆంధ్రభోజుని ప్రతాపాగ్నిగుండమునుండి సెగలుగక్కెడి హంపిశిథిలశిలలు
అలనాటి కాకతీయుల పౌరుషముద్రవిగ్గ గంపకెత్తెడి యోరుగంటిబయలు
బలితంపు రెడ్డిబిడ్డల సాముగరిడీల రాటుతేలిన కొండవీటితటులు
విని కని తలంచుకొన గుండె వ్రీలిపోయి, వేడినిట్టూర్పు వుచ్చెడి వాడెగాని
బట్టగట్టిన గంపెడు బలగముండి, యిల్లులేనట్టి యొకపిచ్చితల్లివీవు!!
రాయిగుద్దును నీపురాశిల్పసంపత్తి నమరావతీస్తూప సముదయంబు
చదివించు నీమహాసామ్రాజ్య కథల నాంధ్రక్ష్మాపతుల జయస్తంభలిపులు
గళమెత్తిచెప్పు నీ గానసౌభాగ్య ధౌరంధర్యమును త్యాగరాయకృతులు
వేనోళ్ల జాటు నీ వీరమాతృత్వంబు పలనాటివీరుల పంబకథలు
వల్లెవేయును నీవైభవప్రశస్తి, హోరుమంచును నేడు మాయోడరేవు
బ్రతికిచెడియున్న నీపూర్వభాగ్యరేఖ, చెఱిగిపోలేదుతల్లి! మాస్మృతిపథాల.
కవులకు నపరంజి కడియాలుదొడిగిన రాయలఁగన్న వరాలకడుపు
సీసాలతోఁ గవితాసవంబందించు కవినాథుఁగన్న బంగారుకడుపు
భద్రాద్రిలో భక్తి బండ్లకెత్తిన రామదాసునుగన్న రత్నాలకడుపు
తెనుఁగుకత్తుల గట్టిదనముజూపిన బాలచంద్రునిగన్న వజ్రాలకడుపు
పిసినిగొట్టు రాజులకును — పిలకబట్టు, కుకవులకు — పిచ్చిపిచ్చిభక్తులకు — పిఱికి
పందలకు — తావుగాకుండ ముందుముందు, దిద్దుకోవమ్మ! బిడ్డలఁ దెనుఁగుతల్లి!

# ఆనవాయి లేని దసరా!

### శ్రీమతి పి. మల్లిగారు

దసరా గడచిపోయినది. పిల్లలు పెద్దలు అంతా దసరా సరదా అనుభవించి నారు. కుటుంబంలోని వ్యక్తుల హోదాను బట్టి దసరా వుంటుందని గృహలక్ష్మి అందరికి చెప్పివచ్చినది. ఒక ఉదాహరణంగా, దసరా చేసుకోని ఆ పిల్లలు పంపిన ఒకరిపోర్టును పాఠకుల కందిస్తూ వున్నాము.

మాకందరికీ కొలువు పెట్టాలంటే చాలా సరదా. దానికితోడు యింట్లో చాలా బొమ్మలువున్నాయి కూడాను. కాని మాఅమ్మ కొలువుపెట్టడం మన యింట్లో అచ్చిరాదని మా సర్దాఅంతా త్రోసి వేసేది. ఈఏడాది తప్పకుండా ఎలాగైనా అమ్మని వప్పించి పెట్టాలని మేమంతా గట్టిపట్టుపట్టాం. దసరా ఇంకా పదిదినా లున్నదనగానే మేమంతా అమ్మదగ్గర కెళ్లి అడిగాం, కాని యీసారికూడా వప్పుకోలే. "మీ ముత్తాత పెళ్లాం అన్నకూతురు కొలువుపెట్టడంవల్ల చచ్చినంత ఖాయిలాపడ్డది. యీసారి మీరుపెట్టి కొంపమీదకి ఏదోవకటి తేకండి" అని గట్టిగా చెప్పేసింది. ఎన్ని చివాట్లు తిన్నా యీసారి పెట్టక మానమని అనుకున్నాం.

ఆరోజు అమ్మ చాలా సర్దాగావుంది దసరాకు అక్కయ్య వస్తుందని. యిదేసమయం అని మేమంతా కొలువుపెడ్తే రసొక్కరావుండలు, మిఠాయి, కొలువైన తరువాత బొమ్మలు దొరుకుతాయని మా చిన్న చెల్లాయికి వుసికొలిపాము.

"అమ్మా! బొమ్మలియ్యవే! అక్కలూ నేను కొలువుపెత్తాం."

"తప్పమ్మా! మనింట్లో ఆనవాయిలేదు."

"అంటే?"

"అంటే మనింట్లో కొలువుపెట్టకూడదూ. బొమ్మలిస్తా ఆడుకో."

"ఉహూ! కొలువుపెత్తామే, నాకొద్దు."

"వుండమ్మా! మంచిదానివికదూ!"

"ఆ! నే వూరుకోను" అంటూ తన ఏడుపు అనే అస్త్రాన్ని ప్రయోగించింది.

"ఆ! అలాగేతే పెడుదువుకాని వూరుకో ఏడవక."

చాటునుండి వింటున్న మేమంతా కుభకకునమని గంతులేశాం. చిన్నచెల్లాయి పరుగెత్తివచ్చి "చిన్నక్కా! అమ్మ పెత్తుకోమంది దావూ?" అని చెయ్యపట్టి లాగటం మొదలుపెట్టింది. వూరుకో చెల్లాయ్ అమ్మ చూస్తుంది" అన్నాం మేమంతా.

సరి యిక మేమంతా అప్పుడే అంతా నిజమైనట్లు బయలుదేరేం. కొలువు ఎక్కడపెట్టేదీ, ఎట్లాపెట్టేదీ ప్లానువేసుకున్నాం. యీసందడిలో మే మెవరం భోజనాలు సరీగా తినలేదు.

సాయంత్రం మాసందట్లో అమ్మకి వంటకి ఎవరం సహాయ్యపడడానికి వెళ్లలే. "పెంకిపిల్లలారా! వుండండి. మీనాన్నగారు రానీయండి. వద్దంటుంటే ఆ కొలువుకి ప్రయత్నాలేమిటో చెప్తా!"

రాత్రి 7 గంటలైంది. నాన్నగారు వచ్చారు. మేమంతా పిల్లులమైపోయాం. నాన్నగారు వచ్చారు కదా అని అమ్మ మరికొంచెం గట్టిగా కేకవేస్తుంది. నాన్నగారు వచ్చి సంగతేమిటని అడిగారు.

"చూశారా! యీపిల్లలు ఎప్పుడూ అలవాటులేనిది యీసారి కొలువుపెట్టారట. సాయంత్రంనుండి చంపేస్తున్నారు."

"పోనీ పెట్టుకోనీ! పిల్లలంతా అంత సర్దాపడుతుంటే నువ్వెందుకు మాన్పటం?" యిది విని మేమంతా సంతోషించాం.

"బాగానేవుంది అసలు మన కది అచ్చిరాదు."

"ఏం? ఎందుచేత?"

"అయ్యో! అప్పుడే మరిచారూ! మీ నాయనమ్మగారు మరీమరీ చెప్పారు. మీ మేనమామకూతురు కొలువుపెట్టి చచ్చినంత ఖాయిలాపడిందని మీరూ ఎప్పుడూ కొలువుపెట్టించకండని చెప్పలేదూ?"

"పోనిస్తూ! సింగినాదం. ఎప్పుడో ఎవరో ఏదో వచ్చి జబ్బుపడితే మనకేం? అయినా రేపు పెద్దపిల్ల కూడా వస్తుంది. అంతా సర్దాగాపెట్టుకుంటారు. పెట్టుకోనీ."

"బాగుంది. పిల్లికి ఎలుకసాక్ష్యం. ఏమో బాబు నే చెప్పేది చెప్పేశాను. యిక మీయిష్టం. ఆతర్వాత ఏమొచ్చినా నా కనకండి."

"పరవాలేదులే. నీ కేమీ అనం" అన్నారు నవ్వుతూ.

ఇట్లా మా నాన్నగారుకూడా మాతో ఏకీభవించారు. ఆరాత్రంతా ఆయన్ని చికాకు చేస్తూ కూర్చున్నాం. రేపు అక్కయ్యవస్తే ఏమేమి కావలసింది జాబితా వ్రాయండి తెస్తానని సమాధానపరిచారు. ఆరాత్రంతా మాకు కలత నిద్దరే.

మర్నాడు మెయిల్లో అక్కయ్య వచ్చింది. అక్కయ్యని చూడ్డంతోనే మా అమ్మకూడా పూర్తిగా యిష్టంలేకపోయినా కొంచెం మెత్తపడింది.

ఇక అక్కయ్య మేము మొదలుపెట్టాం కొలువు శృంగారానికి. మా చిన్నన్నయ్య చాలా తెలివికలవాడు. కాని ఎంతతెలివో అంత పెంకితనం, పంతం కూడాను. మాఅమ్మ మాచిన్నన్నయ్య అంటే ప్రేమ. కొలువు అమర్చడంలో ఎట్లా పేర్చాలో తెలుసు. రోజూ కొలువులోపెట్టే ప్రసాదాల్లో సగం తన కివ్వాలనిన్నీ, యికమీ దతను చెప్పినట్లు మేమంతా నడుచుకోవాలనిన్నీ యీ షరతులమీద కొలువు పేర్చడానికి వచ్చాడు.

పేర్చడం అయింది. ఆరోజు మేమంతా పిలుపులకి బయలుదేరాం, జమానుతో రసక్కారాలు అవీ తెచ్చి జాగ్రత్తపెట్టమని చెప్పాము. పిలిచినవాళ్లంతా ఈఏడాది మేంపెట్టినందుకు ఆశ్చర్యపడుతూ సంతోషించారు.

చీకటిపడకుండా అమ్మ రమ్మనినందువల్ల 6½ కల్లా వచ్చేశాం. కొద్ది యిళ్లుమాత్రం పిల్చాం. యింటికిరాగానే రసక్కారాలు తింటూ ప్రత్యక్షం అయ్యాడు చిన్నన్న. మాకందరికీ చాలా కోపంవచ్చి జవాన్ని అడిగాం.

"నేనేం చేసేదండీ. సాయంత్రం నే లేగానే చిన్నబాబుగారు చూసి అల్లరపెట్టి 15 వుండలు తీసుకొని ఆటపిల్లలకందరికీ పంచారు. అమ్మగారితో చెప్పితే వినిపించుకోలే. మీకు చెప్తే తంతామన్నారండి. నే నేం చేసేది?"

మేమంతా కసితీరా చిన్నన్నయని తిట్టి, అవి పనికిరావని వేరే తెమ్మన్నాం. వాడితో మేమంతా మాటలు మాని, కొలువుగదిలోకి రాకుండా చేసేం. నాన్నగారితో చెప్పి కొట్టించాం. దాంతో వాడికి కోపంవచ్చి నేనుపెట్టిన కొలువు పీకి పారవేస్తానని పట్టుపట్టాడు. కాని మేమంతా వంతులచొప్పున ఆరోజంతా ఆగదిదగ్గర కాచుకున్నాం. అందువల్ల వాడికి కొలువు పాడుచెయ్యడానికి వీలు చిక్కలే.

ఆరోజు సాయంత్రం పిలిచినవాళ్లంతా వచ్చి వూళ్లో అందరికంటే మాకొలువే బాగుందని మెచ్చుకున్నారు. రాత్రి 7 గంటలైంది. కొలువుగది తాళం వేసి మేమంతా భోజనాలకి నాన్నగారితో కొలువు వర్ణిస్తూ కూర్చున్నాం.

"రామం, ఏడీ భోజనానికి రాలేదేమి?"

"ఏమో! మాకు తెలియదు."

"బాగానేవుందేవాడి వెందుకు కొలువుదగ్గరకి

రానిచ్చారు కారు? నాలుగు రస్కోరాలు తిన్నాదనా? మరి మందు ఎందుకు వప్పుకున్నారు?"

"ఆనాలంగే నేమిటి? అన్నీ తినేస్తే యిక మీద వాడితో మాట్లాడితేఁబట్టి" అన్నాం అంతా ఏకగ్రీవంగా.

"పోనీలెండి పీడా వదిలింది. ఒరే! సింగూ! రామాన్ని పిలువురా అన్నాని రమ్మను."

"అమ్మా! చిన్న బాబుగారు మూలగదిలో మంచం మీద పడుకొని మిటకరించిచూస్తూ ఎంత పిలిచినా పలకకుండా వున్నారమ్మా!"

"పోనీ వుండు నే వెళ్లిపిలుస్తా" అంటూ అమ్మ వెళ్లింది. యింతలో త్వరగా రండర్రా కొంపముంచాడు అని అమ్మ కేకలు మాకు వినపడ్డాయి. మేమంతా కంగారుగా పరిగెత్తాం. గదిలో మంచంమీద చిన్నన్న పండుకొనివున్నాడు. అమ్మ వాడి తల వళ్లో పెట్టుకొని "రామం, రామం, మాట్లాడురా! పలకవేం" అంటుంది. రామం గుడ్లు మిటకరించి చూస్తూ, పళ్లు గట్టిగా కరచుకొనివున్నాడు. నోట్లో ఏదోవున్నట్లు బుగ్గలు బూరించివున్నాడు.

"నేను ఎంత చెప్పినా విన్నారుకారు. పాడు కొలువు పెట్టవద్దు. మనకి అచ్చిరాదూ అంటే విన్నారుకారు. కొంపముంచారు. యింతక్కీ మీరు వప్పుకోకపోతే ఆగుంటలు పెట్టాగా? పెద్దదానివి నీవైనా వినొద్దటే? పాడుపిల్లలారా!" అని యింకా ఏమోవో అంటూ మాతోపాటు నాన్ననికూడా దులిపేసింది అమ్మ.

"ఉండవే పిల్లడిని చూడనీవే నీ సోదేమిటి?" అని నాన్నగారు అమ్మని సమీపించారు. ఎంత పిల్చినా పలకడు. పైగా వణకడం ప్రారంభించాడు. దాంతో నాన్నగారు భయపడి డాక్టరికి కబురుపంపారు. మా అమ్మమాత్రం ఆగకుండా అట్లా తిట్టానే వుంది.

"పాడుకొలువు పీకిపారేయండి." భయంతో మేమంతా వెళ్లి కొంచంతీసి మళ్లీ పేర్చింది తియ్యరాదేమో అని వుంచి వచ్చేశాం. చిన్నయ్యనుగురించి అందరికీ భయమేసింది.

ఇంతలో డాక్టరుగారు వచ్చారని చెప్పేడు సింగు. ఆమాట వినేసరికి చిన్నన్న త్వరగాలేచి యిన్ని పాలు వాంతి చేసుకున్నాడు. డాక్టరుగారు వచ్చిచూచి మరేం పరవాలేదని చెప్పి మందిచ్చివెళ్లారు.

"డాక్టరుగారు వెళ్లగానే ఒక్క గంతుతో లేచాడు చిన్నన్న. "చూశారా! మీకొలువు పీకించాను? నన్నెందుకు రానిచ్చారు కారు? కావాలని మీరు భోజనం చేస్తున్నప్పుడు ఆత్మసింగుతో నన్ను పిలవమన్నప్పుడు వుట్టిమీదపాలు నోట్లో పోసుకు పడుకున్నా. యిదంతా వుత్తిదే. చూశారా? నా పంతం చెల్లింది. అమ్మ పంతం చెల్లింది" అని అన్నాడు.

అంతా దంగైపోయాం. యిట్లా చేసినందుకు కోపం, ఎట్లా నటించాడురా అని ఆశ్చర్యం అన్నీ ఒక్కసారే కలిగేయి.

అంతా విని నాన్న పక్కన నవ్వారు. వెంకి వెధవా అంటూ అన్నని దగ్గరకు లాక్కొని. మేమూ నవ్వాం. అమ్మమాత్రం "ఛీ! వుత్తిదే నటించగలవా? అచ్చిరానిదే పెట్టే మరేమిటవుతుంది?" అంది తన విజయానికి పొంగుతూ. కాదే నిజం కాదే నటనంటే నమ్మదు.

మరి మేము ఎవరినీ పిలవలేదు. గదిదగ్గరకి పోక పోతే అమ్మకి భయపడి.

వూళ్లో అంతా గుసగుసలే. సిగ్గయిపోయాం. తెలియనివాళ్లు పాపం కొలువుకి మాకు పిలవలేదేమని మమ్మల్ని నిష్ఠురాలాడారు. వారికి మేం జవాబు చెప్పక అమ్మను తోశాం. ఏం చెప్పగలం? సిగ్గులో నాలుగయిదు దినాలవరకు వీధులోకే రాలే మేం.

కాని యింత జరిగినా వచ్చేఏడాది తప్పక మేం పెట్టామని అమ్మతో అనకుండా మాలో మేం అనుకున్నాం. వచ్చేఏడాది ఏమయ్యేదీ యీసారి వ్రాస్తా.

# గర్భవతి

శ్రీమతి నుసర్ల అన్నపూర్ణాదేవిగారు

"శ్రీమతీ! అట్టులడిగిన సిగ్గుగాదె
యొట్టివనితకునేనియు నెంచిచెప్ప?
నెచ్చెలివిగాన మదికోర్కె లచ్చుపడఁగ
సాహసించితివృచ్ఛింపఁ, జనదునీదు
వాంఛితముదీర్పకుండుట వారిజాక్షి!
కాంతుతోఁగూడిసుఖమున్న కాలమందు
ముట్టుకట్టనుకట్టడి మొండినొప్పి
పీల్చిపిప్పిగఁజేయంగ వేసవేలు
వెజ్జులకుఁబోసి వెఱ్ఱినై వివిధదాన
వ్రతశతంబులుసలిపితి వంతదీర
దామె నేమందు, దిక్కెవ్వరంచు నోడి
భక్తమందారతరునిభు పద్మనాభు
పాదపంకేరుహధ్యాన పరతనుంటి
పంకజాక్షుండుశ్రీరోగ ఫణిమహోగ్ర
గృధ్రమగు లోధ్రజాయువుఁ గృపనుజూపి
దుఃఖవారాసిదాటించెఁ దోయజాక్షి!
దానిసేవించుతటి నెలదప్పెనమ్మ!
ఔనుకాదనివాదము లాడుచుండ
రెండుమాసంబులునుగూడ నిండెనంత
చెలులునను జూచినవ్వుచు శిరములూచి
చెప్పవైతివి చిత్రాలు చిగురుబోడి!
అనుచుఁబరిహాసభాషల నాడునెడను
జనియెమూడవమాసంబుఁ జల్లఁగాను
అడుగునీకేమికావలె నంచు నత్త
పెట్టు కోరినదెల్లను బ్రీతిభర్త
చుట్టపక్కములును జెలుల్ సూడిదలను
దెచ్చిపెట్టుచునుండిరి తియ్యమమర
చిట్టములుపుట్టె వేవిళ్లు చెప్పలేని
ఓకిరింతలబాధకు నోర్వలేక
చిక్కిచీపురుపుల్లనై స్రుక్కుచుండ
జరిగెనైదవమాసమ్ము శాంతముగను
రుచులుచెడె బ్రాలుమాలిక ప్రచురమాయె
మధురవస్తువులందున మనసుపుట్టె
నంతమాయమ్మసారెనా కందజేసి
పుట్టినింటికిఁగొనిపోయెఁ బువ్వుబోడి!
ఎక్కనివ్వదుమిక్కిలి యెత్తుచోట్ల
నెత్తనివ్వదుబరువులు బొత్తిగాను
రామభీమార్జునాదుల రమ్యగాథ
లమలమతులనివరలు సీతాదిసతుల
చరితములనెన్నొ పనివడి చదువబంచె
నంతనాఱవమాసంబు నట్టిచనియె
మెల్లముగచెక్కుటద్దాలు తెల్లవారె
నొడలుబరువెక్కెనడ తడబడదొడంగె
నడుముకన్పడఁజొచ్చెఁ బావడలుబిగిసె
చణకపిష్టసితాగోళచయముతగవు
గాగఁగొనివచ్చిమాయత్త గ్రామమందు
నింటియింటికిఁగొనిపంచి యిచ్చి నన్ను
నాత్మగృహమునుజేర్చిన యంతనచట
సతివలెందఱో నను నున్నతాసనమున
నునిచిపాటలుపాడుచు నొసరఁబుష్ప
గంధమాల్యాదులొసగి నలంకారఁజేసి
వాయనములందియేగిరి వారలెలమిఁ

బుట్టినింటికిఁ దండ్రితోఁ బోతిమఱల
బరగు సీమంత మొనరింపఁ బడఁతిగములు
గానమొనరించుచును గాచకంకణాళిఁ
నెంచినా చేతులకుఁ దొడిగించి కొన్ని
తారుగూడ నుధరియించి తరలిరంత
తలఁగె నేడవ నెలకూడఁ మెఱపుఁబోలి
కటితటంబెంతొ బరువుగా గానవచ్చె
బడలికలు మీఱె మనుదిన మనసుపుట్టె
నెనిమిదవమాసమును గూడ నడగ నేగె
గమన మెంతయు మందము గాగడంగె
నిదురపట్టదు రాతిరి నిర్మలముగ
నిలువఁగూర్చుండ నిట్టూర్పు నిగుడవలసె"
ననిన నెచ్చెలి నవ్వటా లాడునిట్లు
బిడ్డనడ్డాలనిడి ముద్దుపెట్టి మనసు
పడెడుదానికి నీ సుంత బాధబరువె?
ఆకసమునుండి నిసుగొడియందుఁ బడిన
బెంచిపోషింపఁదలఁచితే మించుఁబోఁడి?
గోత్రదీపకుఁ డయ్యెడు కొడుకుఁబడసి
యాయురారోగ్యభోగభాగ్యములనంది
దయితుతోఁ గూడి మనుము మాధవుని
దయను!

# 'అమ్మ'!

శ్రీ కవితావిహార, పన్యాల వేంకట రంగనాథ రావుగారు

అమ్మ! యెంతటి కమ్మగనమ్మ నీదు
రెండు ముక్కల యక్కరాలుండు నమ్మ!
ఏమహాత్ముఁడు తొల్లి నీకీమహా మ
హత్తుఁగలిగిన నామంబు పొత్తినాడో!

*

మధుర మధురామృతంబు, అమ్మయను
సున్ని
తంబులైనట్టి రెండక్కరాలలోన
ఎంత జీర్ణించియున్నదో సుంతయైన
తరుగుదలలేక నెవ్వారి కెరుక తల్లి?—

*

ఈజగత్తున యందము లెన్ని గలవొ
అన్నియును 'అమ్మ'లోన గన్పట్టు
చుండు;
ఎన్ని రసములు తొణుకాడుచున్నవో య
వన్నియును 'అమ్మ' యనుయక్క
రాలలోనె!

ఆయనంతుఁడె తన భిన్న కాయములను
ఎన్నిమార్పులుఁ జేసిన—యెచటనున్న
'అమ్మ' యనకుండ నంతాలనరయఁగలిగి
నాడె—ఆమహాత్మకు లొంగువాడె
యగుచు?—

*

మాటలాడఁగ నేర్చెడు పసితనాన
చిన్ని పసివాడు తానేర్చుకొన్న మొదటి
పలుకులన్నను 'అమ్మ'ను పలుకులేగ
దమ్మ! 'అమ్మ'ని యెంత యానంద
పడునో!

*

ఆడరూపాన జన్మించి కూడ నేరి
కమ్మ బిరుదంబు పొందెడి యాసలుండ
నీమహత్తు లిమిడియున్న నామమరసి—
గొడ్డురాలన నెవ్వతె కోరుకొనును...?

# జపాను సాంఘికావస్థ

శ్రీమతి మారెళ్ల మహాలక్ష్మమ్మగారు

జపాను 70 ఏండ్లకుముందు ఆర్థిక రాజకీయ సాంఘికవిషయములలో మనదేశముకన్న వెనుక నుండెను. జపానుగురించి యెవరికిని ఏమియును తెలియదు. సంఘమందు హిందూదేశమునవలె వర్ణములు, ఉపవర్ణములు ఎక్కువగా నుండెడివి. ప్రజలందరు కూడ తమ పరిపాలకులకు లొంగువారుకారు. పరిపాలనము కొద్ది సామంత రాజులు నడుపుచుండుటచే ప్రజలు చాలా బాధపడుచుండెడివారు జపాను చక్రవర్తికి ఈ సామంత రాజులవల్ల అధికారమేమియు లేక పోయెను. వీరు స్వార్థపరులై తమకిష్టమగునట్లు పరిపాలనము చేయుచుండిరి. కాన జపాను అభివృద్ధికి తావు లేకపోయెను. జపానుదేశమును ప్రవేశించిన బౌద్ధ క్రైస్తవమతములు ప్రజలందు వైషమ్యమును మరింత వృద్ధిచేసెను.

1868 వ సంవత్సరమునుంచి జపానునందు అద్భుతమైన మార్పుకలిగెను. జపానుదేశస్థులు, అమెరికా, చైనా, మొదలగు దేశములకు పోయి వారి నాగరిక, ఆర్థిక సాంఘిక రాజకీయవిషయములు తెలిసికొని జపాను వారికి తగినట్లు అవలంబించిరి. వ్యవసాయము అభివృద్ధి చేసిరి. ఫ్యాక్టరీలను ఎక్కువగా స్థాపించిరి. నావికాదళమును, సైన్యమును నవయుగమునకు తగినట్లు వృద్ధిగావించిరి. పాశ్చాత్యదేశములలో జయముపొందిన ప్రజాపరిపాలనా విధానమును అమలులో పెట్టిరి. బాలురకు స్కూళ్లను, కాలేజీలను పెట్టి, పాశ్చాత్య రాజకీయ ఆర్థిక సాంఘిక విషయములను నేర్పి, వారియందు ఒకవిధమైన ఉద్రేకమును పుట్టించి, జపాను అభివృద్ధికి తావొసంగిరి.

ఈ 70 సంవత్సరములలో సాంఘిక ప్రపంచకమునందు జపాను స్త్రీ ముఖ్యస్థాన మాక్రమించినదని చెప్పకతప్పదు. పాశ్చాత్యుల ననుసరించి ఈ 70 సంవత్సరములలో స్త్రీలు ముఖ్యమైన హక్కులను సంపాదించుకొనిరి. 1871వ సంవత్సరమునందు మొదట 5 గురు స్త్రీలు అమెరికాకు విద్య నభ్యసించుటకై వెళ్లిరి. అమెరికానుండి మినవరీలు వచ్చి స్త్రీవిద్య కెంతయో తోడుపడిరి. ప్రస్తుతము గవర్నమెంటు పెక్కు హైస్కూళ్లను స్థాపించి స్త్రీవిద్యకు ప్రాముఖ్యత ఇచ్చుచున్నారు. టోకియోనందున్న ఇంపీరియల్ విశ్వవిద్యాలయమునందు పెక్కుస్త్రీలు ఉపాధ్యాయులుగా ఉన్నారు. 1901వ సంవత్సరమున ప్రత్యేకముగా స్త్రీలకు ఒక విశ్వవిద్యాలయము స్థాపింపబడినది. కాన ప్రస్తుతము ఉపాధ్యాయినులుగాను, పత్రికాధిపతులుగాను, డాక్టర్లుగాను పెక్కు స్త్రీలు తమ జీవనమును గడుపుచున్నారు. జపాను పారిశ్రామిక దేశము. కాన పెక్కుమంది ఫ్యాక్టరీలయందు పని చేయుచున్నారు. నూటికి 60 మంది స్త్రీలు ఫ్యాక్టరీలయందు ఉన్నారు. కాన జపాను డైటు (Diet)నందు స్త్రీలకు ఫ్యాక్టరీలయందు సౌఖ్యము కలుగుటకై పెక్కు శాసనములు అమలులో పెట్టిరి.

మోగసెట్లను సామంతరాజుల నణచి చక్రవర్తి ప్రజలకు హితముగ రాజ్యము చేయ పూనినప్పటినుండి జపానుయొక్క విద్యాభివృద్ధి పాశ్చాత్తుల ననుసరించి అమలులోనికి వచ్చెను. అప్పటినుండి జపాను గవర్నమెంటు ప్రజలకు పలువిధములుగా సహాయము చేయుచు వారలకు చేయూతనొసగి సాంఘిక రాజకీయవిషయములలో అద్భుతమైన మార్పు గావించెను. పిల్లలు తప్పక స్కూళ్లకు వెళ్లవలెను. గవర్నమెంటు ప్రతిసంవత్సరమును విద్య నేర్పుటకై అమె

రికా, యూరప్ ఖండములకు విద్యార్థులను పంపుచున్నది. తమ ఫ్యాక్టరీలను వృద్ధిపొందించి తమకు కావలసిన సామానులను, వ్యాపారమునకు తగిన వస్తువులను చేయించ మొదలిడెను. ఇందుకుతగిన Technological and Commercial Schools and Colleges ను స్థాపించి సామానులు ఎట్లు ప్రజలకు తక్కువ ధరలకు అందుబాటు చేయవలెనో నేర్పించుచున్నది. ఇంకను విద్యాభివృద్ధి గావించి, ప్రజలకు ఉత్సాహము గావించి, క్రొత్త క్రొత్త వస్తువులను పైదేశములనుండి తెప్పించి అట్టివస్తువులను జపానుచేత చేయించి తన వ్యాపారమును వృద్ధి చేయించుచున్నది. వ్యాపారము సాగించుటకై తగుధనము కావలెను. అందుకొరకు బేంకులను స్థాపించి తక్కువ వడ్డీలకు సొమ్ము నిచ్చుచున్నది. అందుచేత పలువురు కంపెనీలను స్థాపించి వస్తువులను తయారుచేయుచు పైదేశములకు తక్కువ ధరలకు పంపుచున్నారు. ఇంక పోస్టేజి చాలా తక్కువ కరీదుగనుండుటచే వ్యాపారస్తులు తమ ఉత్తరప్రత్యుత్తరములు విరివిగా కొనసాగించుచున్నారు. కార్డు ఖరీదు సుమారు $\frac{3}{4}$ కాన్లు. అనగా హిందూదేశము కార్డుకన్న సాలుగు వంతులు తక్కువ. కవరు ఖరీదు $1\frac{1}{8}$ కాన్లు. అందుచేత విచ్చలవిడిగా ఉత్తరము వ్రాయుటకు తావు కలుగుచున్నది. రైలునందు గాని, మోటారునందు గాని ప్రయాణము చేయుటకగు ఖర్చు చాలాతక్కువ. కనుక ప్రజలు విచ్చలవిడిగా ఒక ప్రదేశమునుండి మఱియొక ప్రదేశమునకు పోయి తమ దేశవిషయములను తెలిసికొనుటకు వీలగుచున్నది. ఇంక గవర్నమెంటు Commercial Bureaus, Commercial Musuems మున్నగునవి స్థాపించి ఫ్యాక్టరీల స్థాపకులకును, వ్యాపారస్థులకును చేదోయి నొసగుచున్నారు. ప్రతి పోటునందును ప్రదర్శనశాలలు నిర్మించుచున్నారు. అందుచేత ప్రజలకు ఒక ప్రోత్సాహముకలిగి క్రొత్తవస్తువులను సృష్టించుచున్నారు. ఇంక ప్రతిఇంటియందును రేడియోలున్నవి. రేడియోఖర్చు చాలాతక్కువ. నెలకు సుమారు 12 అణాలు అగుటచే ప్రతి ఇంటియందును రేడియోలు స్థాపించబడి ప్రపంచకవిషయములను అతి వేగముగా వినుచున్నారు.

గవర్నమెంటు వ్యాపారస్థులకును, రైతులకును తగినంత సహాయము చేసి జపాను వస్తువులను చౌకగా ప్రజలకు అందుబాటు చేయుచున్నది. రైతుల భూములు ఎవరును తనఖాకు వ్రాసుకొనగూడదు. బేంకులు తక్కువవడ్డీలు ఇచ్చునట్లు శాసనములు చేసి రైతులకు తోడ్పడుచున్నది. ప్రజలు విచ్చలవిడిగా పైదేశములకు పోవచ్చును. అందుచే జపాను ఇతర దేశములకు పోయి వారి స్థితిగతులను కనుగొని తమకు తగునట్లు వానిని అవలంబించుచున్నారు.

ఇట్లు రాజకీయ సాంఘిక ఆర్థికవిషయములలో జపాను 70 సంవత్సరములనుండి పాశ్చాత్యుల ననుసరించి ఒక గొప్పమార్పును కలిగించినది. ఇదివరకు పల్లెలందు నివసించు జనులు ఫ్యాక్టరీలందు పట్టణములందు నివసించుచున్నారు. తమ దేశరక్షణమే ముఖ్యమైన సంగతియని జపానుదేశస్థులు గ్రహించిరి. రష్యావలె మతము మానవజీవితమునకు ముఖ్యసంగతి కాదనియు, "ముందు దేశము తరువాత తక్కిన విషయములు" అని నేడు జపాను గ్రహించినది. ఇట్లు అన్నివిధములందును పాశ్చాత్యదేశములకు తీసిపోక తులతూగుచు రుడ్యార్డు కిప్లింగ్ మహాకవి చెప్పిన East is East and West is West and never the 'twain shall meet అను అభిప్రాయము తప్పు అని దృఢముగా నేటి జపాను చెప్పుచున్నది.

# అభాగిని

శ్రీ వెణుతురుపల్లి కామరాజుగారు

"ఈ ఉత్తరము తమవద్దకు గృహలక్ష్మిలో ప్రచురణార్థం పంపించేను. మా స్నేహితుని సోదరియొక్క అంతిమ కోర్కె తీర్చి, పాఠకలోకానికి తెలియజేస్తే, నా కర్తవ్యం నెరవేరిందని సంతోషం కలుగుతుంది. దీనివల్ల లోకానికేదైనాలాభముందని తలిస్తే నాకు మరీ సంతోషం."

నాన్నగారికి,

నవమాసములు మోసి కని పెంచి పెద్ద చేసిన శ్రీ అమ్మగారికిని మీకును యివియే నాకడసారి వందనములు. నే నదృష్టహీనురాలను, యిక నీజన్మలో నా కదృష్టదినములు లేవని గ్రహించితిని. నేను మీగర్భమున జనించి ప్రాణత్యాగ మొనర్చుకొని మీకమిత దుఃఖమును గలిగించినందుకు నన్ను క్షమింపవేడుచున్నాను. ఈ రీతిగా చేయుటకంటె మానవతియైన స్త్రీకి మరే విధమైన దారియున్నట్లు గోచరించదు. నా మరణమునకు పూర్వము నేనెంత సుఖపడినదియు తమకు యీ ఉత్తరమువలన తెలిసినచో ముందువారైన సుఖపడుమార్గమాలోచింతురని మీకు అందజేసినాను. ఇది మీ వద్దన అణగద్రొక్కక మ-రా-శ్రీ అన్నయ్యకుయిచ్చినచో దీనివలన లోకోపకారము కలుగుమార్గ మాలోచించును.

నాకు తోడిబాలికలతో ఖులాసాగా ఆడుకొను రోజులలోనే, పెళ్లి అంటే ఏమిటో భర్తఅంటే ఏమిటో తెలియని రోజులలోనే 7 సం.రముల వయస్సులో పెండ్లిచేసివేసినారు. ఆబాజాలసందడి, ఆముత్యాలపల్లికిలో ఊరేగింపు, బాణాసంచాలు మొదలైన హడావుడిలో ఆ అయిదురోజులు నాకు ఆనందంగానే ఉంది. అయిదురోజులు అయిపోయిన మరునాడునుంచి మామూలుగా నా ఆటలసందడిలోపడి సర్వముమరచి సంతోషముగనే గడిపేను. ఒకటిరెండుసార్లు పండుగపబ్బములకు ఆయన వస్తేనూ ఎవరో చుట్టాలువచ్చేరనుకునేదాన్ని. కాని నాకేమి తెలిసిందిలేదు.

తోడిపిల్లలు నన్ను ఆటలలో ఏదేనా సందర్భములో ముసిలిమొగుడుపెళ్లాం అని ఉడికించేవారు. అదేమో నాకప్పుడు అర్థమయ్యేదేకాదు. ఓనాడు అమ్మా "అంతా ముసిలిమొగుడుపెళ్లాం" అని ఉడికిస్తున్నారేమని ఫిర్యాదుచేసేను. "ఉండబట్టక వాళ్ల మొహం వాళ్లకేం తెలుసు! వెయ్యేళ్లుతపస్సు చేస్తే దొరుకుతాడా వాళ్లకిటువంటి మొగుడు? ఆయనకేం మహారాజు, సాలుకి 10 వేలొస్తాయి. బోలెడంత నగదు వ్యాపారముంది. నీకు ఎన్నినగలుపెట్టేరో చూడు" అని పెట్టెతీసి చూపించింది. కంటె కాసులు

పేరు, గజ్జలవడ్డాణం, గొలుసు పేటలు, పలకసర్లు యింకా ఏవేవో ఉన్నాయి. నా కళ్లు మెరిసిపోయేయి. "నువ్వు పెద్దదానివయేక పెట్టుకోవచ్చు. ఆయ నేమంత ముసిలాడనుకున్నావు. అందరు వట్టినే అంటున్నారు కాని మీ నాన్నగారికన్న 4,3 డేళ్లకంటె ఎక్కువుండవు. అప్పుడేముసిలాడా? వెర్రితల్లి పోయి ఆడుకో" అని నచ్చజెప్పింది. నగలన్నీ చూస్తే సంతోషమేవేసింది కాని నాన్నగారికన్న పెద్దట అని నాలోనే ననుకున్నాను. కాని పూర్తిఅయిన అనుభవంలేక 11 సంవత్సరముల పిల్లనగుటచే ఏదో సంతోషంగానే గడిపేసేను కొంతకాలం.

నాకు వయస్సువచ్చిన తరువాత నాచెలులు ఉడికించేమాటలు బాగా బోధపడ్డాయి. నన్ను అత్తవారియింటికి పంపినది మొదలు సౌఖ్యమనేవి నాజీవితంలోంచి లేచిపోయింది. ఆనగలన్నీ ధరించి శుభ్రమయిన చీరధరించి నిలువుటద్దంలో చూసుకుని అడవికాచిన వెన్నెల అని నిట్టూర్పు విడిచేదాన్ని. పోనీ "చఱ్ఱుబున్నుమనే యువకునికంటె ప్రేమించి లాలించే ముసలివాడైనా నయమే" అను సామెతకూడా నాకు వర్తించిందికాదు. చెఱువుకి నీళ్లకు వెళ్లినా దొడ్లో పనులు చేసుకుంటూ ఆలస్యమైనా ఆయనకు అనుమానమే. పెరట్లో నీళ్లుచేదుతూఉండి కాస్త ఆలస్యమైతే ప్రక్కయింటి కుఱ్ఱవానితో "గోడవద్దనుంచి గుసగుసలాడుతున్నావా?" అని ఓనాడు చావతన్నేరు. ఏవేళప్పుడేనా వీధి గడపలో నిలబడితేచాలు ఆవేళల్లా తిట్టిపోయడమే "దారేపోయేవాళ్లకు చూపులు విసురుతున్నావా?" అని. పేరంటానికెవరో పిలుస్తే నగలుధరించి పట్టుచీర కట్టుకుని ఆయనతో చెప్పడానికి వెళ్లేసరికి అగ్గిరాముడయిపోయి యిలా వేషాలు వేసుకు ఊరంట తిరగడానికి యిదోవంక దొరికింది గాబోలు, యిందాకటి డ్రెస్సు పనికివచ్చింది గాదా ఏమి అమ్మగారికి" అని ఆవస్తువులు చీరతీసి పెట్లో పెట్టితాళం వేసేవరకు వేపుకు తినేశారు. దాంతో నగలకి పేరంటానికి నాటితో స్వస్తిచెప్పేసేను. పోనీ యింట్లో కూర్చుని ఏ పుస్తకమో చదువుకొంటూ అక్కడబెట్టి అవతలకి వెళ్లానో ఆపుస్తకమంతా గాలించేవారు అందులో ఏమే నా రహస్యపు ఉత్తరాలుంటాయేమో అని. యీవిధంగా జరుగుతూఉండేది ప్రతినిత్యమున్ను. చిన్నప్పుడు అమ్మచెప్పినమాటలు జ్ఞాపకమొస్తున్నాయి నీకున్న అదృష్టము తోడి పిల్లలకు వెయ్యితపస్సులుచేసినా దొరకదని. నిజంగా ఎవ్వరికీకూడా యింత అదృష్టము ప్రసాదించవద్దని ఆ శ్రీమన్నారాయణమూర్తికి వెయ్యినమస్కారము లెడుతున్నాను. నేను జేసినట్టిపూజలు నాసోదరీమణులెవ్వరూ చేసినా అదృష్టములో పాల్గొనవద్దని నా ప్రార్థన. నిజంగా నాకంటె వైధవ్యముపొందినవారే అదృష్టవంతులు. ఏమంటారా వాళ్లకి ఒకటేవిచారం లేదని. కాని ఉండీ యిటువంటి కత్తికోతల బారిపడుటకంటె ఎప్పటికేనా యీ అనుమాన పిశాచమువదలి ఆదరణచూపరా అని

కొడువజీవితము పూర్తి చేద్దామనుకున్నా.

కొంతకాలం అయింది. నా భర్తకు వయస్సు హెచ్చినకొద్దీ ఆయనుమాన పిశాచము త్రిగుణీకరింపజొచ్చింది. ఒక రోజున నా స్నేహితురాలు రమణి ఉత్తరము వ్రాసింది. కవరు నా పేర రావడము చూడడమే తడవుగా "ఎవడీ రమణి? పోరంబోకు వెధవలందరూ ఉత్తరాలు వ్రాయడమా? నువ్వు వ్రాసేఉంటావు లేకపోతే నీకీ ఉత్తరమెందుకొస్తుంది? నీకు వీడికి ఏదో సంబంధం వుండితీరాలి. నాకు మొదటినుంచీ అనుమానమే. యీవాళకు దొరుకడ్డావు. వెధవవాడికేనా బుద్ధుండొద్దా పరాయి స్త్రీకి ఉత్తరం వ్రాయడానికి? నువ్వేం వ్రాసేవో చెప్పు" అని నేను చెప్పేదైనా వినకుండా ఉగ్రనరసింహావతారం దాల్చి మూలనున్న పేకరువ్వతో పెళ్లుపెళ్లున చావగొట్టి పగతీరక జుట్టుతో మంచమునకు విరగగట్టి కాళ్లాచేతులా పడకుమ్మేసేరు. నా ఒళ్లంతా రక్తసిక్తమయిపోయింది. కంఠగతప్రాణినై "అది మొగవాళ్లు వ్రాసినదికాదు. చిన్నప్పుడు నాతో చదువుకున్న రమణి అనే ఆవిడ వ్రాసింది" అని చెప్పేను నా మాటయందనుమానము తీరక మళ్లా చూచి ఆ ఉత్తరమంతా చింపి తగలజెట్టేసి మరి రొండు తన్ని అవతలకిపోయేరు. దాంతో యీజీవితంమీద విరక్తిపుట్టింది. ఎప్పుడు తప్పులువెదకెడు పురుషుని గొలుచుట, సర్పముపడగనీడలో కప్పనివసించుటవంటిదని గ్రహించుకున్నాను. మరల వివాహము చేసుకోవలెననుకున్నాను. కాని పూర్వాచార పరాయణులగు మీకు మచ్చతేలేకను, ఒకవేళ తెగించిన నాతడెట్లాదరించునో యనియు మనస్సు స్థిరపడినదికాదు. జీవితము దుర్భరమైనది. యీరాత్రియే నూతబడి ప్రాణములు త్యజించి యీశ్వర సాన్నిధ్యము జేరుచున్నాను. "అత్తింటి గొడవలు పుట్టింట తెలుపుట సాధ్వీలక్షణములు కావ"ని తెలిసియుండియు ఇటుపైన నైన యిట్టి అన్యాయములుచేసి స్త్రీల జీవితములు దుర్భరకష్టముల పాల్పడచేయక "గతంనాస్తి" యని ముందైన మంచిమార్గమవలంబింప తల్లిదండ్రుల కోరుచున్నాను. నాతప్పులు క్షమింప ప్రార్థన. దీనికి విరివియగు ప్రచారము కలుగుమార్గము నాయన్నగారేర్పాటుచేసి నాయంతిమకోర్కె తీర్చగలరని ప్రేమపూర్వకముగా విశ్వసిస్తున్నాను. శలవు. చిత్తగించవలెను.

ఇట్లు అభాగిని

కమల."

# వకుళమాలికా!

శ్రీ వట్టికొండ రంగయ్యగారు

అంకితం : రాజ్యలక్ష్మికి

[శ్రీ తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రిగారి 'వకుళమాలిక' చదివిన తరువాత]

చదివినంతనె "వకుళమాలిక"
సమ్మదమ్మున మేను మరచితి
ఎన్నిసార్లు పఠించినాడనొ
ఎరుకయే లేదు!
ఆ వకుళమృదు సౌరభములో
అ మధురసంగీత ఝరిలో
ఆ విమలరాగాంబునిధిలో
ఐక్యమై పోతిన్!
ఆ లలితపదజాలగుంభము
ఆ మనోహర శైలి జృంభము
ఆ మధురభావోపలంభము
అనుపమానములే!
వాడిపోవు కొలంది వకుళమాలిక మేలి
కమ్మతావుల దెసల్ కుమ్మరించు విధాన
ఈ "గీతికాస్వగత" మేమి వైచిత్ర్యమో
చదువగాచదువగా చవులూరుచుండుగా!
తేటమాటల తెల్గు తీయందనము తీరు
జాతీయముల మేలి చక్కందనము సౌరు
పూలమాలల సమాసాల కమ్మందనము
మంజు సంస్కృతవాణి మసృణమాధుర్యమ్ము
క్రొందళుక్కుటందాల బృందాలచందాలు
ఇవియన్నియుంగూడ ఏకమై, మాలికా
కుదిరెగా నీ యందు కుప్ప తెప్పలుగాగ!
"పుష్పమాలికగనే పుట్టియుండన యేని
పూబోణిగా నేను పుట్టగల్గితినేని
అతని నే వరియించి ఆత్మవల్లభునిగా

కౌగిలింతు తదీయకంఠ మేనేవేళ"
అని పల్కితివిగాదె హర్షాన, మాలికా,
నిజమేన నీకోర్కె నిజమేన, మాలికా?
వకుళమాలిక కిట్టి వాంఛగల్గెన యేని
చివురుబోణుల మాట చెప్పనేమిటి కింక?
ఒకమాట చెప్పగా నుద్యమించితి—కాని—
సిగ్గుగల్గుచునుండె—చెపుదు నేలాగైన
పూబోణిగా నేను పుట్టియుంటిని యేని
అటువంటి కవివర్యు నాత్మేశుగా బడసి
అతని ప్రభావాన ఆ సాహచర్యాన
కవయిత్రినై నేను గడియించియే యుందు
దేశదేశాలలో దీటులేని యశమ్ము
(ఇంతమాత్రాననే ఇంతినై పుట్టగా
కాంతుడు కలదని నాకు కలనైన దలపకుడు)
ఆత్మీయగురువర్యు నా మహాకవిరాజు
వరియించినట్లైన వనిత యెవ్వతె యేని
కోపగించునో యేమొ కుసుమాంగి యిందిర?

నిజము చెప్పవె మాలికా
నీకు తెలియునె మాలికా
కుపితయైతే మాలికా
అపనయింపవె మాలికా
సాదరమ్మున మాలికా
ఏదో అంటిని మాలికా
ఆమెతోడను మాలికా
అటులె చెప్పవె మాలికా

ఎంత సుకృతముజేసె ఇందిరా లలితాంగి
ఆ మహాకవిరాజు నాత్మేశుగా బడయ
నిజముగా నిజముగా నిజముగా, మాలికా,
ఎంత సుకృతముజేసె ఇందిరా లలితాంగి!

# శిశు జగత్తు

## శ్రీ తురగా సుబ్బారావుగారు



నేడు మన కన్నెదుట తమ వినోదచేష్టలచే, హావభావవిలాసములచే, మురిపెముగొల్పు ముద్దుముచ్చటలచే, చిరునవ్వువ దేలియాడు సుందరవదనారవిందరూపసందర్శములచే, జననీజనకుల హృదయముల సానందాబ్ధిని ముంచు బాలపాపలే భావికాలమున దేశమునుఱ్ఱూతలాడించు యువకయువతీమణులు. అట్టి బాలపాపలు శైశవమునుండియు క్రమశిక్షణ పొందిననేగాని దేశోన్నతికి కారణభూతులు కాజాలరు. అట్లు చిన్ననాటనుండి బాల బాలికలకు సత్ప్రవర్తన, ఉత్తమాశయములు గరపి, వారి అభ్యుదయమునకు తోడ్పడు విధానమంతయు స్త్రీల చేతులలో నేయున్నది. ఏలనన బిడ్డలు ప్రాయమువచ్చువరకు తల్లివద్ద మెలంగుచుండుటచే తల్లియొక్క గుణములే తత్సంబంధమైన స్వభావములే బిడ్డల కలవడును. బిడ్డలకు చిన్ననాటినుండియు వారి మానసికసీమయందు ఉత్తమగుణములు, సద్భావములు, సద్గోష్ఠి దృఢముగ నాటుకొనునట్లు చేయుచో అవి యెన్నటికి నశింపవు. అల్లిబిల్లిగ నల్లుకొనిన ఒక లతానికుంజమును దాని స్వస్థానమునుండి వేరుచేయుట ఎంతదుర్ఘటమో యట్లే చిన్ననాట బాలపాపల చిత్తసీమయందు దృఢముగా నాటుకొనిన స్వభావములు మార్చుట కష్టతరము. కనుక బాలపాపలు అభ్యుదయము పొందుటకు లేక పతితులగుటకు జననియే బాధ్యురాలు. ఏలనన ప్రపంచమున నుద్భవించిన మహాపురుషులందరు ఉత్తమస్త్రీలకు జనించి, వారి సుశిక్షణ, సత్క్రమబోధ బడసిన వారే.

"It is the mothers who can raise the whole world. It is the mothers who can make the country rise or fall. It is the mothers who can make the tide of nature ebb and flow. It is always the great heroes who are the sons of great mothers. If these truths are instilled into the child in its infancy, it may grow to be a Krishna or a Christ."

*—Ramathirtha*

మహారాష్ట్రులలో మేటివీరుడయి శౌర్యపరాక్రమ, ప్రతాపాగ్నికి మేటియనందగి ఛత్రపతి యని బిరుదువహించి శివాజీమహారాజు ఘనుడగుటకు బాల్యమున అతని జనని జీజీబాయి గరపిన సుబోధ, ఒసంగిన సుశిక్షణవలననే కదా! వివేకానంద, జీససు, రామతీర్థ, ఖడ్గతిక్కన మొదలగు మహాపురుషుల జీవితచరిత్ర పరిశీలించినచో ఇట్టి అంశములే గాన నగును. కనుక మాతృదేవతవంటి సుబోధకురాలు యీ భూవలయమున గానరాదు.

తమ పసిబిడ్డలకు ఎటువంటిశిక్షణ యీయవలనో కూడ తెలుసుకొనుటకు స్త్రీలకు జ్ఞాన మత్యంతావశ్యకము.

పిల్లలు చేతులు ఎప్పుడూ ఊరకుండవు. వారి చేష్టలు అనేక రకములు. వారెప్పుడు అతిచురుకుగా

వుంటారు (very active and curious). తల్లులు భద్రముగా దాచియుంచిన తినుబండ పదార్థములన్ని దొంగతనముగా సంగ్రహిస్తారు. గాజుసామానులు, బొమ్మలు పగలుగొట్టుతారు. తండ్రి బల్లమీదవుంచిన పుస్తకములు, సిరాబుడ్లు తల్లక్రిందులు చేస్తారు. ప్రతి విషయానికి పేచీ పెడతారు. ఇంకను ఇటువంటి అల్లరి, చిల్లరిపను లెన్నో చేసెదరు. కొందరు తల్లులు యీ మురిపెముగొల్పు ముద్దుచేష్టలు జూచి మురిసి పోవుదురు. కాని కొందరు గట్టిగా శిక్షించి దండనాది ప్రహారణములచే నిరుత్సాహపరచెదరు. పిల్లలకు సంతోషమును పొంగి పొరలివచ్చు వుత్సాహాన్ని తల్లి ఏమి నిరుత్సాహపరచకుండా వారికి తగినంత ప్రోద్బలమిచ్చి వారి వుత్సాహాన్ని ద్విగుణీకృతము చేయవలెను. తగినంత తప్పువున్ననేగాని బెత్తముచే శిక్షించకూడదు (rule of the rod). వారు తల్లిదండ్రుల సమక్షమున నున్నంతసేపు కారాగారములో బంధింపబడినమాదిరిగా వారు తలంచకుండా వారికి తగినంత స్వేచ్ఛనిచ్చుచు ప్రేమభావముతో వారిని ఆదరించవలెను. అట్లని వారి యిష్టానుసారము స్వేచ్ఛానువర్తనమునకు తావియ్యక, వారికి విచక్షణాశక్తి తక్కువ గనుక తల్లియే వాని మానసికతత్వము ననుసరించి నయమునగాని భయమునగాని వారి పురోభివృద్ధికి పాటుబడవలెను. వారు తప్పుచేసిన శిక్షకూడ తప్పుననుసరించి యుండవలెనుగాని కొద్దిపాటి తప్పుకు, గొప్ప తప్పుకు ఒకటేవిధంగా శిక్షించిన బండతనము వహించి మొండితనముతోనుందురు. మితిమీరిన గారాబము ఎంతనష్టమో, వారి మానసికశక్తులను నశింపజేసే దండనాదిప్రహారములుకూడ విచక్షణలేకుండా వుపయోగించినయెడల అంతే నష్టము.

పిల్లవాడు అల్లరిచేసినను, తల్లికి విసుగు కలిగించినను, తల్లి గృహకృత్యనిర్వహణమునకు అడ్డుతగిలినను, త్వరితముగా అన్నము తినకపోయినను, మరియేవిధమయిన ఇబ్బందిని తల్లికి పిల్లవాడు కలుగజేసినను, వారిని లొంగదీయుటకై తల్లులు తమ పసిబిడ్డల చిత్తసీమలయందు బూచివాళ్లను, దయ్యములను, బుడబుక్కలవారిని భయముగొల్పు వికారస్వరూపములతో, చింపిరిజుట్టులతో, ఉరిమినగ్రుడ్లతో, దిగ్భ్రమగొల్పు వికారవింతచేష్టలతో కల్పించుదురు. ఇక పెరిగి పెద్దవారయినతరువాత ధైర్యసాహసములు, చిఱుప్రాయమునుండియు లేనిది ఎక్కడనుంచి వచ్చును? ఉగ్గుపాలతోకూడా శౌర్య ధైర్యాదులు రక్తనాళయములందు ప్రవహింపచేయుటకు మారుగా తల్లులు చిన్నతనములో పిల్లలచే అల్లరి మాన్పించుటకై యీ భయముకల్పించి నిస్తేజుని చేయుదురు. అందుచేతనే సంఘములో తోడివారినిచూచి, జనసమూహాన్నిచూచి భయపడేవారిని జీవితములో కష్టపరంపరల నెదుర్కొనలేక పిరికిపందలై ఆత్మహత్య జేసుకొనునటువంటివారిని చూచుచున్నాము. బాలురలకు క్రమశిక్షణ ఎట్లు యీయవలెనో యీక్రింది కథవలన కొంతవరకు తేటతెల్లము కాగలదు.

రాముడు 3 సం. కుర్రవాడు. నిరంతరము చిఱుతలకు సహజమైన అల్లరిపనులచే తల్లిని శ్రమపెట్టువాడు. అందుచే తల్లి వానికి భయమును కల్గించుటకై తామున్న గదికిఅవ్వల ప్రక్కగదిలో వింతరూపముతో నల్లని ఆకారముగా ఒక దయ్యమున్నదని మిక్కిలి భయంకరముగానున్నదని వాని మనస్సున బాగుగ నాటునట్లుచేసెను. ప్రతిదినము ఆటపాటలతో మోమునదరహాసముతో గంతులువైచు బాలుడు అప్పటినుండి భయముచెంది ఆగదివైపు అడుగుపెట్టెడివాడు కాడు. ఒకనాటి సాయంత్రము వానితండ్రి కచేరినుండి వచ్చి, తనకు ఆగదిలో కావలసిన వస్తువును చెప్పి తీసుకురమ్మని నియోగించెను. కాని ఆబాలుడు గదిలో దయ్యముకలదని భయముచే నిస్తేజుడై పిరికితన మావహింపగా పోవుటకు నిరాకరించెను. తండ్రి పిల్లవాని భయమునకు కారణమెఱింగి అతని మనస్సున నాటుకొనిన అపోహను

తొలగించుటకై ఒక యుక్తిపన్నెను. ప్రక్కనున్న సేవకుని పిలిచి ఏదియో చెప్పెను. సేవకుడు వెంటనే వెనుక ద్వారమున అగదిజొచ్చి అగదిలోనున్న తలగడ నొకటి తీసుకొని దానికి ఒక వల్లటిబట్టగప్పి, తలగడ చివరలు, దయ్యము చెవు లనుకొనునట్లుగా చేసి గవాక్షముగుండా దానిని బయటకు త్రోసెను. వెంటనే పిల్లవానిదృష్టి అటువైపు మరల్చబడెను. వెంటనే ఆ కనుబడుచున్నది నిజముగా దయ్యపుచెవులే యని తండ్రితో చెప్పెను. కాని తండ్రి వానికి భయము కల్పింపక ఆ దయ్యమును చావమోదుమని బెత్తమును చేతికిచ్చి, దానిని ముట్టడింపగల సమర్థత, తన వాక్చాతుర్యము చేత వానిలో నుత్సాహమును ప్రేరేపణచేసెను. అందుచే బాలుడు వెంటనే దానిని బెత్తముతో చావమోదగా సేవకుడు కీచుకీచుమని ఒక వింతధ్వనిచేసెను. అధ్వనికి బాలుడు సంతోషము చెంది దయ్యమును జయించితినని విజయసూచకముగా నా క్రందన మొనర్చెను. వెంటనే బాలుని దయ్యమును పారద్రోలిన ధీరుడవు, వీరుడవు అనునట్లుగా వాని మానసికస్థితిని మార్చి ఇంతకు పూర్వము దయ్యము అను అపోహను వానినుండి తొలగించి ధైర్యయుతునిగా చేసెను. వెంటనే బాలుడు అగదిపోచ్చి ఆ దయ్యము తలమీద చావమోది ఆనందబాష్పములచే పులకితుడయ్యెను. లోనుండి సేవకుడు ధ్వని చేయుచుండెను. ఆ ధ్వనిని వినునట్లు బాలుని దృష్టిని అటుమరల్చెను. బాలుడు అట్లు తాను అపోహపడిన దయ్యమును వినుగు లేకుండ బాదుచుండగా తలగడను ఇవతలకు లాగెను.

"దయ్యమును తలగడక్రింద మార్చిన ధీరుడవను" భావమును వాని మనస్సున నాటజేసి బాగుగా నుత్సాహపరచి పూర్వపు అపోహను తొలగించి అది దయ్యము కాదు తలగడని అనుకొనునట్లు వాని భావములను, మనోదృక్పథమును మార్చి వానిని తండ్రి సంతృప్తి పరచెను. వెంటనే ఆబాలుడు విజయపూర్వకముగా ద్విగుణీకృతోత్సాహముతో గంతులు వేయుచు తన తండ్రికి కావలసిన వస్తువు తెచ్చియిచ్చెను.

కథ సందర్భా లెట్లున్నను, అందలి సారాంశము గ్రహించుటే ఇది పుదహరించుటలో ముఖ్యోద్దేశము.

## 'గృహలక్ష్మి'

శ్రీమతి కొరప్రోలు వెంకటరంగమ్మగారు

సీ. జోలపాటల లాలించుఁ బాల వీవె
ముద్దుపల్కులు పల్కెడి ముగుద వీవె
కళలు విద్యలు నేర్చెడు కన్యవీవె
కార్య భారంబుదీర్చెడి కాంత నీవె
ధర్మ విధులను బోధించు తల్లి నీవె
రాజ్య కార్యంబులను దీర్చు రాణి వీవె
నీతులెన్నియొ దెల్పెడి మాత వీవె
సంఘ సంస్కారములఁజేయు జాణ వీవె
నవరసంబులు నీయందె నాట్యమాడు
ఆంధ్ర వనితల విజ్ఞాన మతిశయింప
బ్రోదివెట్టిన 'గృహలక్ష్మి' బాగడవలదె?

మ. నీయుత్సాహమె మాకు రక్ష జగతిన్ నీప్రాపె మాభాగ్యమా
నీయౌన్నత్యమె మాబలంబు తలపన్ నీవృద్ధియే జీవమూ
నీప్రోత్సాహమె యాంధ్రకాంతలమదిం నిత్యంబు దీపించెనిన్
కేయన్ కేసరి ముద్దుపట్టి నిను నేకీర్తింపగా నేర్తునే.

# వింతలు

శ్రీమతి మిస్ ఎం. దయామణిగారు

'సుందరం' ఓ పదునారేళ్ల పడుచమ్మాయి. బళ్లోకొస్తుంది. బడి దూరమయ్యో, హడావుడి పనిమీదేమో బొట్టెట్టినట్లొస్తుంది సరిగ్గా బెంకు సుందరి. అంతకో పావుగంట ముందే వచ్చుంటారు హాస్టలు వారంతా. అందువల్ల బడికొట్టే ఆలస్యంగా ఉన్నా వాళ్లందరికంటె ఆలస్యంగావడాన 'లేట్ లతీఫ్' గట్టేశారు సుందరానికి.

ఓనా డేలాగో అందరికంటె ముందొచ్చింది సుందరం, అందరి కళ్లల్లోను బడింది. "ఏమోయ్, సుందరీ తొందరగా వచ్చేవీ వాళ" అంటూ మువ్ చేసింది అన్నపూర్ణ. "మరేమోయ్, ఏడువింతల్లో నొక వింతలా గుందే'' అంటూ సెకండ్ చేసింది పద్మం. ఇకనంత నూరుకోరాదు. "ఎనిమిదోవింతేదే నోయ్" అంటూ స్ట్రాంగ్ చేసింది పైవాళ్ల ప్రపోజల్సును సౌభాగ్యం. మొత్తంమీద క్లాసంతా 'సుందరి'కి వ్యతిరేకంగానే ఓట్ చేశారు!

అల్లరేచుంటూ క్లాసులో అడుగుట్టానో లేకో లేచింది 'ఎనిమిదోవింత జరిగిందండీ' అంటూ మణి. 'ఏం' అన్నాను. విననట్టు ప్రజంట్ చేసింది జరిగినమేటరంతా సువర్ణం. పాపం సుందరి ముఖం ఉషుకబెట్టిన వంకాయలాగుంది. అండీ! అంటూ గిర్రునతిప్పేసిందికండ్లునీళ్లతో! పాపం అనిపించింది. సుందరి నేలాగన్నా సమర్థించాలనుకొన్నా. 'ఏడువింత లేవన్నా'ను. ఎవ్వరూ మాట్లాడలే. 'పలుకరేమ'ని కోపంగా అనేసరికల్లా "లేదండీ మాకు తెలియదుగాని అందరు వాడుతుంటే సరదాగ మేము వాడేమండీ' అంటూ సవరించింది సునందం. "తెలియని గప్పాలు కొడ్తున్నారండీ" అంటూ నా మాట పూర్తిచేసింది తనకసి తీర్చుకోడానికి సుందరం. 'అయితే మాకు చెప్పండి ఏడువింతలంటే నేమో' నంటూ మరీ ధైర్యంజేసింది సుందరి. ముఖానికి కళకూడ వచ్చింది. సుందరిని సంతోషపెట్టడానికని చెప్పకతప్పిందిగాదు.

ఒకటో వింత ఈజిప్తుదేశములోని సూచ్యగ్రస్థంభములు (కూచిగానుండు దిబ్బలు) ఈజిప్తు ఎడారిలోనొక ఎత్తగు దిబ్బపై 'కయుఫస్' అను రాజు క్రీ. 3000 సం. క్రిందట గొప్పకట్టడము నొకదానిని కట్టించెను. దీనిని కట్టుటకు 20 సంవత్సరములు లక్షలకొలది బానిసలు పనిచేసిరి. క్రమముగా (కాఫ్ర) యనురాజు. 'నెటాక్రెస్, యను రాణియు మరిరెండు దిబ్బలను కట్టించిరి.

2వ వింత బాబులోను దేశపు వ్రేలాడు తోటలు. 'నెబుకద్నెజరు'అను రాజు బాబులోను దేశము నేలుచుండినపుడు పూవులును, తోటలన్న ప్రీతిపడు తన భార్యను

సంతోషపరచుటకై మహా ప్రచండమైన గోపురములను కట్టించి వానిమీద మట్టి దిబ్బలను పోయించి అక్కడ చిత్రమగు తోటలను నిర్మించెను. వానిలో కొన్ని భూమికి 300 అడుగుల ఎత్తున నహా యుండి చూచువారి కన్నులకు వింతగొలుపుచుం డెను.

3వ వింత 'రోఢ్స్'లోనున్న బ్రహ్మాండ మైన విగ్రహము. 'రోఢ్స్' అను దీవిలో నున్న ప్రజలమీదికి 'డెమిట్రస్' అను గ్రీకు ప్రతినిధి కుమారుడు యుద్ధమునకు బోయెను. అప్పుడు వారికే జయముగలిగి నందున 'అపొల్లో' యను తమదేవత గౌర వార్థమై బ్రహ్మాండమగు విగ్రహము నొకదానిని నిర్మించిరి. కొంతమంది మను ష్యులు కలసినను దాని బొటనవ్రేలు నహా ఎత్తలేకుండిరి. అది కంచుతో చేయబడెను.

4-వ వింత 'డయాన' అను దేవతకు నిర్మించిన దేవాలయము. 'ఎఫెసు' పట్టణ ములో 'డయాన' అను తమ దేవతకై 'ఎఫెసీయులు' గొప్ప దేవాలయమును మహా నైపుణ్యముతో నిర్మించిరి. దీనిని క్రీస్తు పరిచారకుడగు 'సెయింట్ పాలు' దర్శించిరి.

5వ వింత 'ఆర్టిమిష్య' అను రాణి కట్టిం చిన గోరి. 'ఆర్టిమిష్య' అను రాణి మరణిం చిన తన భర్త జ్ఞాపకార్థమై 'హాలికర్నసస్' అను తమ రాజధానిలో మహా ప్రచండమగు నొక గోరీని నిర్మించెను.

6వ వింత అలెగ్జాండ్రియాలోని లైట్ హౌస్, దీపస్థంభము. రాత్రివేళ దారి కను గొనలేక సముద్రములో నాశమగుచున్న ఓడలను రక్షింపనై 'టోల్మె' అను రాజు 'అలెగ్జాండ్రియా' రేవు పట్టణమున 8 అంత స్థులు గలిగి 600 అడు. ఎత్తులోనున్న దీప స్థంభము నొకదానిని కట్టించెను.

7వ వింత ఒలింపియాలోని 'జ్యూయిస్' అను దేవత. ఒలింపియాలో ప్రతి సంవత్స రము పందెములు జరుగును. అందు గెలి చినవారి జ్ఞాపకార్థమై బంగారు, దంతము మొదలగు విలువగల వాటితో నొక దివ్య మగు విగ్రహమును జేయించిరి. దానిపేరు 'జ్యూయిస్'. చూచుటకు వింతగానుండును.

అని చెప్పేసరికల్లా 'నాపుణ్యాన నేర్చు కున్నారులే' అంటు డాబుచేసింది సుంద రమ్మ.

శ్రీ గాలిపెంచల నరసింహరావుగారు
మ్యూజికల్ డైరక్టర్

## సునాదవినోదిని—ఆదితాళము

| | | |
|---|---|---|
| ఆరోహణ : స గ మ ద ని సఀ | ,, అం ప్ర చ కా చ " |
| అవరోహణ : సఀ ని ద మ గ స | స గ మ ద ని సఀ |

65-వ మేళకర్తయగు మేచకళ్యాణియందు జన్యము

ఔడవ ఔడవ రాగము:

వ్రేలికి నాలుగుఅక్షరముల పొవ్వున ఘాతనుండి రెండు అక్షరములు

త్రోసి పాడుకొనవలయును.

పల్లవి. ఆరాధించెదు - అఖిలదైవములె
అరిషడ్వర్గాంత - రంగహితులే - నే॥ నారా॥

అనుపల్లవి. కోరికయను మానుషదోషంబులె
క్రూరమైన కాలాహికి నెరవలె॥ ఆరా॥

చరణము. ఈ లోకము నీ దౌర్భాగ్యము లేలా
నా లోకము నాయందే యుండగ
ఆలోచింప నాలో తపంబునన్
నాలో నేనే నేనా దిలలో॥ ఆరా॥

| | | | |
|---|---|---|---|
| పల్లవి. , , : | సా,సా, సా ,, సాసా | ,, ని సానిధని | సానీదామా |
| | ఆ,రా, ధిం ,, చెదు | ,, అఖిలదైఇ | ఈవములే |
| గా : | గమదా ,, దామాదనిపా | నీ దమగామా | గాసాపాగమ |
| ఏ : | అరిష ,, డ్వఅర్గఅఅం | త రంంగ | హితులేఏఎ |
| దని : | సా,సా, సనిగస సాసా | ,, నిసాసదని | సనినిద దమమగ |
| ఎఎ : | ఆ,రా, ధింంం చెదు | ,, అఖిలదైఇ | ఇఇవఅ ములేఎ |
| గా | గమదా ,, దామా దనిసని | నిద దమమగ గమ | గసాసా గమ |
| ఏ : | అరిష ,, డ్వఅ ర్గఅఅఅ | ంత రంంం గఅ | హిఇతులే ఏఎ |
| దని : | | | |
| ఎఎ : | (నారాధించెదు) | | |

అనుపల్లవి. , , : గా,గగా మామా దామా | దా నిసాసపా | సనిగప సనినిద
, , : కో,రిక గల మఅ | ఆ నువదో డి | వం౦౦ బుధ రెవి
గ మ : గసగసగా మగమా దమదమ | దని సపాసపా | నిపగప నిసనిద
ఎఎ : కొ౦ఒఒరిక గఅల మఅఅఅ | అఅ నువదో డి | వం౦౦ బుధ రెవి
మ ద : నిసాస సాగాగా గమాగ | సా నిసానిదా | దమమగ గమదని
ఎఎ : కృఊర మై ఈన కఅఅ | ఆ లఅహి౦ | నెవరఅ వీఅరెవి
సా : నిసాస సాగాగా గమదమ | గస సగస నిసని | దనిద మదమ గమ
ఏ : కృఊర మైఈన కఅఅఅ | అఅ లఅఅహి౦ఇ | నెఎఎ రఅఅ వఅ
దని :
రెవి : (ఆరాధించెదు)

చరణము. , , : సగాసగా మాదామదదని | , ద దమాగమా | గాసా సా ,,
ఇఈలో౦డి కముఇఇదా౦ఊ | , ఊ ర్భఅగ్యము | ర ఏ రా ,,
, , : సగాసగా మాదాగమదని | సని దనిదమగా | గమదమ గసా
ఈఇలో౦డి కముఇఇదా | ఊఊ ర్భఅఅగ్యము | రెఎఎ లఅఅ
, , : నిసపా ,, నిసగస సనినీ | ,, సగాగమగ | గాసా సాసా
నఅలో ,, కఅముఊ నఅఅ | ,, యం౦దెఎ | యు ౦ ద గ
, , : నిసపా ,, నిసగస సనినీ | ,, సగమ మదమ | గమగస సనిసా
నఅలో ,, కఅముఊ నఅఅ | ,, యం౦ దెఎ | యు౦౦౦ దఅగా
, , : గగగా ,, మామా దాదా | మా దనీ సపా | సనిగప సనినిద
అఅలో ,, చిం పసా | ఆ లా౦డితపం | ౦౦బుధ నన్ ఆఅ
దమ : గసగ మగమ దమదని సనినిద | దమ దనిసపసా | సనిగప సనిదమ
అఅ : అఅఅలా౦ఒఒ చిం౦౦౦ పఅనఅ | అఅ లా౦ఒఒతపం | ౦౦బుధ నన్ అఅ
దని : నిసాసపగా గా ,, గమాగ | సా నిసని దనిద | దమమగ గమమద
అఅ : నఅలా౦డి నే ,, నెఏఎ | ఏ నెఎఎ నాఊఊ | దిఇలఅ లా౦ఒఒ
దని : నిసాసగా గా ,, గమదమ | గస సగస నిసని | దనిదమ గమదని
ఒఒ : నఅలా౦ఒ నే ,, నెఎఎ | ఎఎ నెఎఎ నాఊఊ | దిఇలఅ లా౦ఒఒ
సా :
ఓ : (ఆరాధించెదు)

## చిట్టస్వరము

, , : సాసని దమదని దా,మదని | దమగా మదమగ | సాసని సగాగ
మగ : మదాద నిదనిసాస నిసగా | గసాసదాదమ | , మగాగ మదమ
దని : (ఆరాధించెదు)

# స్త్రీలు-సంఘసేవ

శ్రీమతి వడ్లమూడి అన్నపూర్ణమ్మగారు

"యత్రనార్యస్తు పూజ్యంతే రమంతే తత్రదేవతాః"

సంఘమభివృద్ధి పొందవలయునన్న స్త్రీలభివృద్ధి పొందవలయును. ఇందులకు కారణము సంఘములో స్త్రీలు దరిదాపుగా సగపాలుండుట మాత్రమే కాదు; భార్యారూపమునను, మాతృరూపమునను స్త్రీ తన ప్రభావమును సంఘములో నితరులపై బాగుగ ప్రసరింపజేయగలిగియుండుట. పురుషుడెంత విద్వాంసుడైనను, ఎంత సంస్కారియైనను తనవిద్యను, తన సంస్కారమును ప్రయోగించి యితరులనుద్ధరించెడు దానికంటె స్త్రీ విద్యావతి, సంస్కారిణియైనచో తన విద్యవలనను, సంస్కారమువలనను నెక్కువ యుద్ధరింపగలదు. తండ్రి పండితుడైనచో కుమారుడు పండితపుత్రుడును, స్త్రీ విద్యావతియైనచో పుత్రులు విద్యావంతులు కాకతప్పదు. కనుకనే "పురుషుడు చదువుకొన్నచో నతడొక్కడే బాగుపడును. కాని స్త్రీ చదువుకొనినచో నాకుటుంబమంతయు బాగుపడును" అను పెద్దలమాట.

మంచిదైనపక్షమున కుటుంబమునందు తల్లియొక్క ప్రాబల్య మెంతయైనను మేలుచేయును. గృహమునకు శోభను, పరిశుభ్రతను, యశస్సును, శాంతిని తెచ్చునదితల్లి; గృహములో నైకమత్యమునకును, సంతోషమునకును మూలమగునదితల్లి. లోకములో మహనీయులైన మహాపురుషులయొక్క గొప్పతనమంతయు తల్లిమూలముననే వచ్చుచున్నదని విద్వాంసులభిప్రాయ పడియున్నారు." అని వీరేశలింగము పంతులుగారు చెప్పియున్నారు. కనుక స్త్రీల యభివృద్ధిని గమనింపక సంఘాభివృద్ధికొరకు ప్రయత్నించుట నేలవిడిచి సాముచేయుట.

పూర్వస్త్రీలకు సంఘములో నెంతోగౌరవ మీయబడినది. ఇంటిలో స్త్రీ శాంతముగనున్నయెడల నిల్లంతయు శాంతముగనుండును. స్త్రీ దుఃఖించుచున్నచో నిల్లంతయు నేడువవలసినదే. గృహమున స్త్రీ యింతముఖ్యము గనుకనే 'ఇల్లు ఇల్లుకాదు. ఇల్లాలే యిల్లు' అనుచుందురు. ఇల్లు శోభావంతముగనుండవలయునన్న నిల్లాలు కలకలలాడుచు నుండవలయును. అట్టియింటి యందే లక్ష్మి విహరించుచుండును. శాంతి విలసిల్లుచుండును. "కలకంఠకంఠి కన్నీరొలికిన సిరియింట నుండనొల్లదుసుమతీ."

కాని యిప్పుడో! సంఘమున స్త్రీలకు గౌరవము లేదు. స్త్రీయన దాసి. విలాసవస్తువు. కడవంత గుమ్మడికాయయైనను కత్తిపీటకు లోకువయైనట్లు, ఎంత విద్యావతియైనను, ఎంత యుత్తమురాలైనను, ఎంత వివేకవతియైనను, అల్పుడైనను పురుషునకును లొంగియుండవలసినదే. ఆడుపిల్ల జన్మించినదనగనే తల్లిదండ్రులకుగలుగు విచారమింతింత గాదు. ఆడుపిల్లలున్నవారికి సంఘమునతలవంపులు గలుగుచుండును. వారిని దీనులుగ, చూచి జాలిపడుచుందురు. బిడ్డలు లేకుండుటకైన నంగీకరింతురు కాని, యాడుబిడ్డలు జన్మించుట కంగీకరింపరు. కుమార్తె కలిగినదని వినగానే తండ్రియు, నాప్తబంధువులును విచారముతో 'శ్రీరామరామా!' యని నిట్టూర్పు విడుచుచుందురు. స్త్రీశిశువింత దుర్గతికి కారణమగుటకు సంఘమూఢత్వమే మూలము. దీనిని మార్పకపోయినచో—సంస్కరింపకపోయినచో స్త్రీలకు గతిలేదు. పురుషులకు సుఖము లేదు. సంఘమునకు మోక్షము లేదు.

నేడు స్త్రీలు స్వశక్తులను, గౌరవమును గోల్పోయి వంటయిల్లేజీవనమనుకొని కాలమునంతయు వ్యర్థపుచ్చుచున్నారు. చదువు పురుషులకేగాని స్త్రీలకేల? ఉద్యోగముచేయుదురా? ఏమి యుప

## శ్రీమతి వడ్లపూడి అన్నపూర్ణమ్మగారు

బాపట్ల నివాసులు. 'గృహలక్ష్మి' పాఠకులకు పరిచయమైన వీరి వ్యాసాలు ఉన్నతాభిప్రాయాలతో నిండియుండును.



'స్త్రీల మానసప్రవృత్తి కోమలమైనది. ఆ ప్రవృత్తికి తగిన చిత్రకళ, కవిత్వము, సంగీతము మొదలగు లలితకళలు, వైద్యము మొదలగు వృత్తులు, శిశుపోషణము, కుటుంబనిర్వహణము మొదలైన పద్ధతులు నేర్పవలయును. ఈ కార్యములు ప్రభుత్వములు నిర్వహింపవలసినవి. ప్రభుత్వముచేత నీ కార్యములు చేయించుటకు స్త్రీలు గట్టిగ పూనుకొనవలయును. ఇందుకు సంఘములుగా చేరి యాందోళనము ప్రారంభింపవలయును. ప్రతిపత్రికయు ప్రతిసభామండపము ఈవిన్నపములతో ప్రతిధ్వనింపవలయును. ఇటు లేర్పరచుకొనిన మండలములలో అచ్చటచ్చట గల యధికారుల భార్యలను, అక్కచెల్లెండ్రను, తల్లులను మొదలగువారిని చేర్చుకొనుట మంచిది. వారివలన చాల మేలు చేకూరగలదు.'

వీరి ఉత్తమాశయాలకు పై దొక నిదర్శనము.

## విదుషీమణి డాక్టరు సి. మీనాక్షి గారు, ఎం.ఏ., పిహెచ్.డి.

'శ్రీమతి మీనాక్షి ద్రావిడ బ్రాహ్మణయువతి. ఈమె పూర్వీకులు దాదాపు 350 సం.నుండి చెన్నపురి కాపురస్థులు. ఈమె తండ్రి మద్రాసు హైకోర్టు మేనేజరుగా నుండెను. వీరి సోదరు లొకరు తిరువాంకూరు విశ్వవిద్యాలయ ప్రొఫైసరు భాష్యలరుగాను, మరొకరు క్రైస్తవకళాశాలలో జంతుశాస్త్ర పండితులుగను ఉన్నారు.'



'మద్రాసు విశ్వవిద్యాలయమున డాక్టరు పట్టమును పొందిన ప్రథమ నారీమణి యీ విదుషీమణిగారే. వీరి వయస్సు ముప్పది సంవత్సరములు మాత్రమే. ఇంత చిన్నవయసునచే భారతవర్ష విద్వన్మండలిలో పేరు ప్రఖ్యాతులు గడించిన యీమెకు గొప్ప భవిష్యత్తుకలదనుట నిస్సంశయము.'

(వివరములకు 600వ పుటను చూడుడు)

యోగములేని చదువెందులకనుచు వారు చదువుకొనక, బాలికలకు చదువుచెప్పించక అజ్ఞానదశలోనున్నారు. ఇదివరకు వారుచేయుచున్న చేతిపనులన్నిటిని మరచి పోయి పరదేశములనుండి సరకులను తెప్పించి వాని నుపయోగించుచు స్వదేశవస్తువులవైపు కన్నెత్తియైనను చూచుటలేదు. అందువలన వారు పరదేశవస్తువులపై నాధారపడి తమకు చేతనైన పనులన్నిటినిమఱచి పరదేశవస్తువులకొరకు డబ్బువెచ్చించుటయేగాక తాము పగలంతయు అనవసరప్రసంగములతో కాలమును వ్యర్థముచేయుచు ఆరోజున కారోజు అజ్ఞానాంధులగుచున్నారు. మరల స్త్రీలు పూర్వస్థితికి రావలయుననిన మరల తాము సంఘములుగా నేర్పడి తమ కొఱకు కృషి చేసికొనవలయును. స్త్రీలకందరకు నీ లోటుపాట్లను తెలియజేసి దేశపరిస్థితులను తెలిపి మరల నెప్పటిస్థితిలోనికి వచ్చుటకు నడుముగట్టి పని చేయవలయును.

స్త్రీ లిప్పుడు సాంఘికముగను, ఆర్థికముగను, రాజకీయముగను, శారీరకముగను, మానసికముగను హీనదశయందున్నారు. వీనికన్నిటికిని ప్రధానకారణము స్త్రీ తన సత్తాను తాను తెలిసికొనకుండుట. వారు తమ యథార్థస్థానము నెఱుంగుటకు ముందుగ జ్ఞానము నలవరచుకొనవలయును. కనుక స్త్రీలకు విద్య యత్యావశ్యకము. మన దేశమున స్త్రీలు నూటికేయిద్దరు ముగ్గురో చదువుచున్నారు. వీరైనను విద్యవలన ప్రయోజనము కలుగునంతవరకు చదువక పెక్కురు ఎలిమెంటరీ క్లాసులతోనే తమ చదువును ముగించుచున్నారు. ఇట్టి చదువువలన నెన్నదగిన లాభము కలుగదు. పెద్దచదువులు సయితము తమ కక్కరకురాని ప్రణాలికతో బద్ధమైయున్నవి. ఈ ప్రణాలిక మన యభివృద్ధి కనుకూలసాధనము కానంతవరకు దీనివలన మన మధికలాభమును పొందజాలము.

పాశ్చాత్యదేశములయందా దేశపరిస్థితుల ననుసరించి ఆ సంఘపరిస్థితుల ననుసరించి యచటి విద్యావిధానముండును. మన దేశమునగూడ మన పరిస్థితుల ననుసరించి విద్యావిధానముండవలయును. మన యాదర్శములను సాధించుటకనువుగా మన విద్య యుండవలయును. అట్లు లేకపోవుటవలననే చదువుకొనిన స్త్రీలకు సయితము నేడు సంఘములో దగినంత గౌరవము కానరాకున్నది. బాలికలు ప్రత్యేకముగ చదువుకొనుటకు ఉన్నతపాఠశాలల లెక్క దనో కాని లేవు. కళాశాలలలో నొకటి రెంటికంటె నెక్కువలేవు. ఇచ్చటి విద్య నైతము స్త్రీల పరిస్థితుల ననుసరించి లేదు.

స్త్రీల మానసప్రవృత్తి కోమలమైనది. ఆ ప్రవృత్తికి దగిన చిత్రకళ, కవిత్వము, సంగీతము మొదలగు లలితకళలు, వైద్యము మొదలగు వృత్తులు, శిశుపోషణము, కుటుంబనిర్వహణము మొదలైన పద్ధతులు నేర్పవలయును. ఈ కార్యములు, ప్రభుత్వములు నిర్వహింపవలసినవి. ప్రభుత్వముచేత నీ కార్యములు చేయించుటకు స్త్రీలు గట్టిగ పూనుకొనవలయును. ఇందుకు సంఘములుగా జేరి యాందోళనము ప్రారంభింపవలయును. ప్రతిపత్రికయు ప్రతిసభామండపము ఈవిషయములతో ప్రతిధ్వనింపవలయును. ఇటు లేర్పరచుకొనిన మండలులలో అచ్చటచ్చట గల యధికారుల భార్యలను, అక్కచెల్లెండ్రను, తల్లులను మొదలగువారిని చేర్చుకొనుట మంచిది. వారివలన చాల మేలు చేకూరగలదు.

ప్రస్తుతస్త్రీల దుస్థితిని స్త్రీలకు నాటునట్లు మొదట బోధింపవలయును. అందులకు స్త్రీలు తీరికగ కూర్చున్నప్పుడు సంభాషణలమూలమునను, ఉపన్యాసములమూలమునను తమ మూఢదశను వారికి బాగుగ నచ్చజెప్పవలయును. తాము తరచుగ జూచెడి నాటకములలోను, సినిమాలలోను, తరచుగా వినెడు హరికథలలోను, జంగముకథలలోను గల పాత్రలలో ఉత్తమస్త్రీలయొక్కయు, నీచస్త్రీలయొక్కయు చరిత్రలలోని భేదములను స్పష్టముగ జూపి మంచియాదర్శములకు ప్రయత్నించునట్లు పురికొల్పవలయును. తమ చేయనున్న ఉత్తమస్త్రీ చరిత్రములను స్పష్టపరుపవలయును. ఇతర మహిళామణుల నడవడులను

వివరింపవలయును. విచిత్రదీపప్రసంగములను (Magic lantern) జరుపవలయును.

ఆస్తిలేనందువలన గలుగు నష్టములను తొలగించుకొనుటకును రాజకీయముగ వారనుభవించుచున్న ఇక్కట్టులను మాన్పుకొనుటకును ఓటుహక్కును ముందుగా సంపాదించుకొనవలయును. ఇందుకు స్త్రీలు తొలుత ప్రయత్నము చేయవలయును.

వీనియన్నింటికంటె ముందుగ తమ దురాచారములను తాము పోగొట్టుకొనవలయును. వీనిలో వరకట్నములు ప్రధానములు. వీనివలన బాలికయొక్క విద్య, గుణము, శీలము మున్నగునవన్నియు పనికిరాక పోవుచున్నవి. ఇట్టిస్థితిలోనే గృహస్థులు తమ బాలికలకు విద్య చెప్పించుటకు బ్రయత్నింతురు. విద్యాశీలములున్నప్పుడు కట్నమును కొంత తగ్గించుటకైనను నొప్పుకొందురాయన్న నదియు గానరాదు. అంతేగాక మరికొంత యెక్కువగా చెల్లించుకొనవలసి వచ్చుచున్నది. బీదయింటి బాలికకు మరియెన్ని సుగుణములున్నను పెండ్లి యగుటకే యాస్కారము లేనప్పుడు స్త్రీలకు గౌరవ మెక్కడగలదు? కనుక కట్నము లిచ్చువారుగాని, పుచ్చుకొనువారుగాని స్త్రీల గౌరవమును భంగపరచుచున్నారే యని చెప్పకతప్పదు. ఈవిషయమును పురుషుల దోషముకంటె స్త్రీలదోష మెక్కువ. స్త్రీలు పూనుకొనినచో నీ కట్నపుపిశాచము ఒక్కనాటితో సాగనంపగలరు.

ఇప్పుడు సామాన్యముగా తమ కుమారుల వివాహకాలమున అనగా తమకు కట్నము వచ్చునప్పుడు వీలైనంతవరకు కట్నములను రాబట్టుకొనుచు తమ కుమార్తెల వివాహము వచ్చునప్పటికి కట్నములు పనికిరావని నిషేధించుచు నుపన్యాసములు లేగగొట్టుచుందురు. ఇట్టి యూకదంపులవలన బ్రయోజనము లేదు. కట్నముల నిచ్చుటను, పుచ్చుకొనుటను నిషేధించుచు కట్నముల తీసికొనమనియు, ఇయ్యమని ప్రతిజ్ఞ పూనవలయును. తమ కొక గొప్పవాడల్లుడైనాడని సంతసించుకొనవచ్చును గాని తమ బాలిక యొకనికి దాసి కాకతప్పదు గదా? స్త్రీల సామాన్యగౌరవమునకు భంగము గలిగించుచు తాము మాత్రము గొప్పగా నుండదలంచువారు యథార్థమైన గౌరవము నెప్పుడును పొందజాలరు.

బాలికలైనను యీవిషయమును శ్రద్ధవహించి పెండ్లాడమని పట్టుదలను చూపవలయును. అట్టి దానిని వివాహమాడుటకంటె అవివాహితగానుండుటయే గౌరవమని భావింపవలయును.

స్త్రీలు తీరికకాలమునందు కొంత ధనము కూర్చుకొనుట కనువుగా కొన్ని చిన్నపరిశ్రమలను నేర్చుకొనవలయును. అందులకు స్త్రీ సేవాసంఘములు మొదట పూనుకొని తమ సభ్యురాండ్రచే జేయించిన వస్తువుల నచ్చటచ్చట ప్రదర్శనము జేయించుచు వానివలన ప్రయోజనములను వానిని తయారుజేయు పద్ధతులను బోధింపవలయును. ఈరీతిగా స్త్రీలు తయారుచేసిన వస్తువులను స్త్రీలే కొనుచుండవలయును. తమ యింటికి కావలసిన వస్తువులను కొనునప్పుడు తమకు సమీపమున స్త్రీలు చేసిన వస్తువులేవైనగలవాయని ముందుగ నాలోచింపవలయును. అట్టివస్తువుల క్రయవిక్రయములు స్త్రీసంఘములు జరుపుచుండవలయును.

ఉదయము భోజనములైన వెనుక కొంతకాలము తీరుబడియుండును గాన నావేళయందు సేవాసభ్యురాండ్రచ్చటచ్చట చుట్టుపట్ల స్త్రీలు కూర్చుండి చదువుకొనుట కనుకూలమగు ప్రదేశములలో స్త్రీలను జేర్చి చదువు చెప్పుచుండవలయును.

ఇట్టి సమావేశములలో వార్తాపత్రికలను చదివి దేశవిషయములను బోధించుచుండవలయును. స్త్రీలు పాడుకొనుట కనుకూలములైన రసవంతములగు పాటలను నేర్పవచ్చును. ఒకరిద్దరు స్త్రీలుచేరి చక్కగ పాటలు పాడ నారంభించినచో చుట్టుపట్టుల స్త్రీలెల్లరును చెవి కోసికొని యచ్చటికి వచ్చుచుందురు. పాట లాకర్షణకొరకేగాక యానందమునకును బాగుగ నుపకరింపగలవు. పాటలతోబాటుగా భాగవతము, భారతము మొదలగు పురాణములుగూడ నప్పు

దప్పుడు చదివి కథలు చెప్పుచుండుట మంచిది.

తల్లిదండ్రులు లేక దిక్కులేకయున్న పసిబిడ్డలను స్త్రీలు పోషింపవచ్చును. అందులకు పెద్ద ధనవంతులు కానక్కరలేదు. తమలోతాము కొన్ని బియ్యము ప్రోగుచేసి యొకచోట నా పిల్లలనుంచినను నుంచవచ్చును. లేక ఒక్కొక్క పిల్లవానిని దినమున కొక్కరు చొప్పున కొంతమంది పోషించినను పోషింపవచ్చును. ఎటులైనను స్త్రీలు తలచుకొనినచో కష్టముగాదు. స్త్రీలు తలచుకొనినచో నింటివద్ద నుండియే సంఘసేవసేయుట కనేక మార్గములు కలవు. తమ యింటిలోని పురుషులను సన్మార్గవంతులుగ జేయుటకు స్త్రీల కెక్కువ యవకాశములు గలవు. తమ బిడ్డలను మంచివారులుగ, సంఘసేవాపరాయణులుగ జేయుటకు స్త్రీలకున్న యవకాశములు మరియెవ్వరికిని లేవు. ఇట్లు పరోక్షమార్గమునను ప్రత్యక్ష మార్గమునను సంఘము నుద్ధరించుటకు స్త్రీలే పూనుకొనవలయును. స్త్రీలు తమ కర్తవ్యములను బాధ్యతలను తెలిసికొని తమ ధర్మములను నెరవేర్చి సంఘమున తమ కుండవగిన గౌరవమును సంపాదించి లోకము నుద్ధరింతురు గాక.

# బుద్ధుడు - భూతదయ

శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు

అడిగెనే? ఆతల్లి బుడిబుడి శోకించు కోడిపుంజుల పేద కుత్తుకలను
కోరెనే? ఆయమ్మ నోరుఱుంగని లేఁత ప్రాణుల మాంసమ్ము బలియొసంగ
ఆశించెనే? ఆదయార్ద్రహృదయ అజాగళగళ ద్రక్తధారలను ద్రావ
వచియించెనే! అమ్మవారు చిరంజీవి జీవితమ్ముల విశసింపుఁ డనుచు
నక్కటా! విశ్వమాత దయాప్రపూత పేరుపెట్టి జీవుల నిట్టు ఘోరభంగి
తునిమి తూటాడనగునె? యోమనుజులార! తగిన పనియౌనె మానవధర్మమునకు.

తలఁపుఁడీ! మనపురాతన ఘోర హింసలు జలజల దుఃఖ బాష్పములు కురియ
తొలఁచుఁడీ! యవివేక విలసనమ్మునఁ జేయు హింసా దురాచార పాంసులతను
కడఁగుఁడీ! ధర్మమార్గ ప్రతిష్ఠాపన వ్యాపారమునకు బద్ధాదరులయి
బోధింపుఁడీ! ధర్మబోధ దేశములలో జీవకారుణ్య వశీకృతులయి

"ఆత్మవత్సర్వభూతాని" యనుప్రసిద్ధ, ధర్మ సూత్రార్థ మెఱిఁగి సత్కర్మనిరత
హృదయులై సంచరింపుఁడో సదయులార! శ్రద్ధ నాలింపుఁడయ్య! యీ బుద్ధబోధ.

అన్నెము పుణ్యముం దెలియ కాదట మీఱఁగ మందలోనికిన్
గ్రన్నన నేగుచో నెగిరి గంతులు వైచెడు మేకపిల్ల మీ
కన్నుల గుట్టెనేమి? యిటు కాఠియు వెట్టుచు కట్టిపెట్టి అ
న్నన్న! దయావిహీనులయి ఆత్మల దీయుదురే? బలాత్కృతిన్.
కసిదీర నోరెఱుంగని పశువుల విశసించి కఠిన భావమునఁ దు
ర్దశ పాల్పడకుఁడు! మానవ పశుత కుదాహృతులు గాక భాసిలుఁడయ్యా!

# ప్రేమశక్తి

శ్రీ నై. రామమూర్తిగారు

అది సాయంత్రము. వృద్ధుడొకడు గమనాయాసముతో మెల్లగ అడుగులిడుచుండెను. అతని వెనుక కొంతదూరమున ఒక యువతి వచ్చుచుండెను. అతడదియెఱుగును. కాని నిల్చి మాట్లాడలేదు. ఆయువతి తల విరియబోసికొని వెలవెల పాఱుచూపులతో తత్తరపాటుజెందు హృదయముతో ముసలివానిచేర కాళ్లు తడబడ నడకను సాగించుచుండెను. వారిరువురును నిశ్శబ్దముగ కొంతసేపు ప్రయాణించిరి. సూర్యుడు అస్తమించెను. చీకటి గ్రమ్ముచుండెను.

ఆయువతి వృద్ధుని ఒక గృహద్వారము కడ ఆపి, గద్గదస్వరముతో "అయ్యా! అదో అనల్లని గోడలను చూచారూ? అవి నాచుతో కప్పబడిన పురాతనపు గోడలు. ఆగోడలమధ్య ఒక కారాగృహము ఉంది. అందు నేను వరించిన యువకుడున్నాడు. మీరు ప్రతిదినమును గంట వాయిస్తున్నారు గదూ? ఈ రాత్రి గంటమ్రోత వినబడగానే అతణ్ణి అచ్చట ఉరిదీయవలెనని న్యాయాధికారులు అతనికి ఘోరశిక్షను విధించిరి. కాబట్టి అతనికి సహాయముచేసి ప్రాణమును కాపాడువారు ప్రపంచమునందు ఎవరూ కనబడలేదు. నేను మిమ్మల్ని ఒక్కటి ప్రార్థిస్తున్నా. మన ప్రభువు విల్లియమ్ అర్థరాత్రివరకు ఇక్కడికిరారు. వారి భయము మీకేమాత్రము వద్దు. మీరు ఈ రాత్రి గంట వాయించకుండా వుండండి." ఆమె వణకుచున్నను యెఱ్ఱని పెదవులతో అస్ఫుటముగా వృద్ధుని బ్రతిమాలెను.

ఆవృద్ధుడామెతో "అమ్మాయీ! నేను చిరకాలమునుండీ అంధకారంలో వుండే గంటను మ్రోగిస్తూ నావిధి సక్రమముగ చెల్లిస్తున్నాను. ఇప్పుడుకూడా అట్లే తప్పక జరిగితీరవలసివున్నది. ఇన్నాళ్లవరకూ నా విధియందు ఎటువంటిలోపమూ జేయనట్టి వాడను నేను. నేను ఇట్టి అక్రమకార్యము చేయను. ఆగంట ఎప్పటివలెనే మ్రోగిస్తాను" అనెను. ఆమాటలామె వీనులకు ములుకుల వలె తోచెను. ఆమె వివర్ణవదనయై అట్లే నిలువబడి వింతగా వృద్ధునివంక చూచుచుండెను. నిష్ఠురులైన న్యాయాధ్యక్షులిచ్చిన తీర్పు, కొంతకాలములో తన హృదయేశ్వరునకు కలుగబోవు దారుణమరణము ఆమె హృదయమున గోచరించెను. ఆమె దీర్ఘనిశ్వాసములు బుచ్చి, మతి స్థిరపరచుకొని తనలో స్పష్టముగ "గంటమ్రోగకుండుగాక" అని పలుకుచు ముసలివానివైపు తిరిగి "తాతా! అలాఅయితే నేను వెళతా" అని చెప్పి ఒక్కపరుగున పరుగెత్తిపోయెను. ఆమె సాహసించి ఏమిచేయునోయని ఆలోచించుచు వృద్ధుడు అచ్చటనే నిశ్చేష్టు

డయి ఆమె పరుగిడిపోయిన దిక్కునకే చూచుచు నిలిచియుండెను.

యువతి త్వరగా గంట వ్రేలాడుచున్న స్థలమునకు వెళ్లుచుండెను. ఆగంట ఒక ఉన్నతగోపురమున బంధింపబడియున్నది. గంటవద్దకు వెళ్లవలెనన్న అంధకారబంధురమగు మెలికలు తిరిగియున్న మెట్లుద్వారా వెళ్లవలయును. ఆమెట్లు నిచ్చెనమెట్లుకన్నను సన్నగిల్లియున్నవి. అయినను ఆమె ఏమాత్రము జడియక ఆవణకుచున్న పెదవులతో తనలోతాను "గంట మ్రోగకుండుగాక" అను పూర్వోక్తవాక్యమును ఉచ్చరించుచు ఆ చీకటిగదిని సమీపించెను. ఆమె తడబడుచడుగులతో మెట్లెక్క మొదలిడెను. ఆమె చేతిపట్టువదలక వెనుకకు తిరిగిచూడక ఆదారిపైకి వెళ్లుచుండెను. కొంతసేపటికామె గంట నందుకొనగల్గెను. ఆమె అచ్చటాగెను. ఆచీకటికోణములో తేరి పారజూచెను. అందు కంచుగంట వ్రేలాడ కట్టబడియున్నది. అది పాతాళలోకములోనున్నట్లు కనుపించెను. ఆమె కన్నులకు చీకట్లు క్రమ్మెను. గుండెఝల్లుమనెను. అయినను హృదయేశ్వరునెడగల ప్రేమ అమితశక్తి నొసగెను. ఆమెకు దడమాని ధైర్యముకలిగెను. పట్టువదలక తనప్రయత్నమును కొనసాగింప నిశ్చయించుకొనెను. తక్షణమే ఆమె ఇంచుకపైకెగిరి గంటమధ్యనుండు అయోమయగోళమును గట్టిగా తన రెండు హస్తములతో పట్టుకొని వ్రేలాడెను. వెంటనేగంటయు, ఆయువతియు ఒక్కఊపూగిరి. ఆఊపులో, ఆమెకానగరమంతయు, ఆకాశమడుగంటైనా యున్నట్లు, మిణుకుమిణుకుమనెడియు నక్షత్రములనుబోలు దీపకాంతులతో కనబడెను. కొంతసేపువరకు ఊగి, ఆమె యీ గంటనుబట్టి అట్లే వ్రేలాడుచుండెను. వృద్ధుడు యువతివెళ్లిన కొంతసేపటి వరకు అచ్చటనే నిలువబడి తన నిత్యకృత్యమును నెఱవేర్చుటకు నెమ్మదిగ గంటవద్దకు వచ్చుచు "పాపము ఆఅమ్మాయి భర్తను పోగొట్టుకొనక తప్పదు. నేను నాధర్మాన్ని ఎప్పటిలాగే నెఱవేర్చకమానను. పరమేశ్వరుని ఆజ్ఞ అయిపోయినది. నేను జాలిపడితే మాత్రము లాభమేముంది?" అని తనలో తాననుకొనుచు గంటగోపురద్వారము కడకు వచ్చి నిలచెను. కొంతసేపటికి గంట నిర్ణయకాలమయినదని తెలుసుకొనెను. మెల్లగా "అయ్యో! యెంతపాపము చేయవలసి వచ్చెను" అనుచు గంట త్రాడుబట్టి గట్టిగా లాగుచుండెను. అతడు బధిరుడు. ఆగంట మ్రోగునదియు లేనిదియు అతనికి తెలియక పోయెను. గంట నడుమనుండు ఇనుపగుండునుబట్టి ఆమె వ్రేలాడుచుండుటవలన గంట ధ్వనింపలేదు. కాని ముసలివాడు త్రాడును లాగినప్పుడు ఆగంటతో యువతియు గిరగిర తిరుగుచు కొట్టుకొనుచుండెను. కొంత సేపట్లు కొట్టుకొన్నపిమ్మట గంటఊగుట మానెను. తనపని ముగిసెనని వృద్ధుడు త్రాడును విడచిపెట్టి ఇంటికి వెళ్లిపోయెను. తనపనియు ముగిసెనని వనితయు గంట ఇనుపగోళమునువిడిచి మెట్లుదిగి క్రిందికి

వచ్చెను. ఆ స్థలమంతయు నిర్మానుష్యము కారు చీకటి. ఆమెకు చేతులలో ఒకవిధమైన బరువుతోచెను. పరిశీలించి చూచుకొనగా అనేకచోట్ల నవి చితికియుండెను. రక్తము కారుచుండెను. ఓర్పుతో పట్టుదలతో పనిచేయునప్పుడే బాధయు తోచలేదు. కాని తరువాత ఆగాయములామెను పీడింపజొచ్చెను.

రెండుచేతుల నెత్తిని తుడుచుకొనుచు నామె మెల్లమెల్లగా నడచి త్రోవనుచేరి రాచబాటలో ప్రవేశించి నడచుచుండెను. ప్రతిదినము ప్రొద్దుగృంకినతోడనే, దైవనిర్ణయము వంటి తనయాజ్ఞననుసరించి మ్రోగుచుండు గంటఆనాడు మ్రోగకుండుటవిని, ఆందోళన మనస్సుకలవాడై విల్లియమ్‌ప్రభువు, ఆదారిని బాదచారియై వచ్చుచుండెను. అతనిని జూచి, యువతికు ర్తెరిగి, చెదరినగుండెను కుదుటపరచుకొని, ఆతని పాదములపై బడెను. తోడనే విల్లియమ్ ఆశ్చర్యముతో ఆమెనుపైకి లేవనెత్తి, "అమ్మాయీ! నీవెవతెవు? నీవేలయీచోట తిరుగుతున్నావు?" అనిఅడిగెను. యువతిమాటాడలేక వెక్కివెక్కియేడ్చుచుండెను. ప్రభువు, "తల్లీ! దుఃఖించవద్దు" అనిఓదార్చెను. యువతినోటమాటరాకతనరెండుచేతులనువారికిచూపి, ఊరకయేడ్చుచుండెను. తుదకు జరిగినదంతయు తెలుసుకొని, "అమ్మా! నీపతిప్రేమకు నాకు చాలాసంతోషం కలుగుతూంది. నీభర్తను క్షమిస్తాను" అని, తనజేబునుండి ఒకకాగితమునుదీసి జేడుక్షమాపత్రమును వ్రాసియిచ్చెను. ఆమె అది మహాప్రసాదమని అందుకొని, తనకృతజ్ఞతా సూచకముగా ఆతని అడుగులనుబడి, యశ్రువారి అర్ఘ్యపాద్యములిచ్చి సెలవుపుచ్చుకొని, త్వరితగతినేగెను. ఆమెక్షమాపత్రము పొందియున్నను కాలమువిూరుటచే ప్రియుని ఉరిదీసిరేమోయని చింతనొందెను. మరింతశీఘ్రముగా కారాగృహమువైపు పరుగిడెను. రాజభటులు, ఒక సుందరుని సంకెళ్లతో కారాగారామునుండి, ఉరికంబమువైపునకు తీసుకొనివచ్చుచుండిరి. యువతి వారినిజూచినది. ఆమె హృదయేశునకెదురేగి ఆతని పాదములపై బడెను. ప్రియుడామె నెత్తిఓదార్చెను. "నాభర్తను విడవండి" అని తనచేతిలోనున్న క్షమాపత్రమును వారికిచ్చెను. ఆమెభర్త హస్తములను పట్టినిలచెను. భటులందరు నిశ్చేష్టులయిరి. ఆనిందితుని చేతిసంకెళ్లను ఊడదీసిరి.

"ప్రాణప్రియా! నాకు ప్రాణదానముచేసితివా?" అని పురుషుడామెను హృదయమునకు హత్తుకొనెను.

# మా అమ్మ

శ్రీమతి కె. విమలాదేవిగారు

"అంతా నాన్నా అని పిలుస్తారు. మా నాన్న ఏడే అమ్మా."

"తెలివి తక్కువచేత ఆయనతో పోట్లాడేవు నీ పుటకలవు. గీతవుంటే యెప్పటికైనా కలుస్తామేమో."

ఇంట్లో వీళ్లు మాట్లాడుకొనే ధోరణిచూస్తే నాన్నగారు మంచివారని తెలివిగలవారని చేతులార కాపురము పాడుచేసుకొని అమ్మ పుట్టింటికి చేరిందని తోచేది. ఎవరన్నా బంధువులు యెరిగివున్నవాళ్లు ఇంటికి వస్తే నాన్నగారిమాట తప్పక వచ్చేది. అప్పటి ప్రసంగాలు విన్నప్పుడు నాన్నచాలా చెడ్డవాడనిపించేది. ఎప్పటికైనా కలిస్తే నిజం నిమ్మళంగా తెలుస్తుందని గోతికాడి నక్కల్లె వేచియున్నా.

అదృష్టమువల్ల మా మేనత్త చూడ్డానికి వచ్చింది. అంతవరకూ చింపిరితల, ముఖాన బొట్టులేకుండా పిచ్చిదానాల్లె వకమూల పడియున్న అమ్మ వుత్సాహముతో అత్తయ్యను కలుసుకొని "మీనాన్న యిట్లాగే వుంటారు" అని నన్ను హెచ్చరించింది. అత్తయ్య నన్ను ప్రేమతో దగ్గరకు తీసుకొని "అంత తెలివిగల మీనాన్నవుండి మీగతి యిల్లావున్నదా" యని కండ్ల నీళ్లు పెట్టుకొన్నది. మానాన్నను చూపమని దిక్కుమొఖంతో అడిగేటప్పటికల్లా హృదయం కరిగి మాట యిచ్చి దక్కిచ్చుకొన్నది. అమ్మ చాలాసేపు గుసగుసలాడింది అత్తయ్యతో. అమ్మమ్మ మర్యాదగా మాట్లాడి పంపింది.

బళ్లోనుంచి వచ్చి పుస్తకాలు సర్దుకుంటూ వుండగా "పిల్లలను తీసుకొని వెంటనే బయలుదేరిరా" అని టెలిగ్రాము వచ్చింది. మా అక్కయ్య లేకుండా వెళ్లవలసి వచ్చిందని చింతించా. నేను అమ్మా సర్దుకొని వక చిన్నమాట తయారుచేసుకొని బయలుదేరాం. కళ్ల నీళ్లు పెట్టుకుంటూ అమ్మమ్మ తాతయ్య సాగనంపారు. అమ్మ వాలకంచూస్తే బలవంతంగా ప్రయాణం చేస్తూవున్నట్టు తోచింది. రాత్రి యేడున్నర గంటలకు అత్తయ్యగారి వూరుచేరి, యెకాయెకీ వాళ్ల యింట్లోకి వెళ్లవచ్చునా, ఎందుకో జంకుతూ బయట నిలబడి కబురు పంపింది అమ్మ. అత్తయ్య ప్రేమతో బయటికివచ్చి స్వాగతంచెప్పి, "అన్నయ్య షికారువెళ్లారు లోపలికి రండి" అని తీసికెళ్లింది. "అధికప్రసంగం చేయక నీవు చెప్పదలచిన విషయం వివరముగా మాఅన్నయ్య మనసుకు యెక్కించు. ఇదివరకుమల్లె తెలివి తక్కువగా ప్రవర్తించకు." "వదినా. ఆయన ముఖం చూట్టానికి భయంచేత యిన్నాళ్లు పుట్టింట నానా మాటలు పడుతూవున్నా. పిల్లలను ఆయనకు వప్పచెబుదామని ధైర్యంగా వచ్చాను. నీమేలు మరువను." ఇంతలోనే వచ్చాడయ్యా ధూకుడుగా నాన్నగారు. నేను అమ్మాపక్కగదపలో నక్కాం. యెందుకో నాకే తెలియదు. "వంట అయిందా? బావ సిద్ధంగా వున్నాడా? ఆకలిగా వున్నది వడ్డించు" అంటూ వంటయింట్లోకివచ్చి పీటమీద కూర్చున్నారు: కమ్మని కబుర్లు చెప్పడం ప్రారంభించేటప్పటికల్లా, చురుకైన వాడని యితరుల మనస్సు ఆనందింపచేయగల శక్తిగలవాడని తోచింది. మామయ్యగారు త్వరగా భోంచేసి చెయ్యి కడుక్కొని నన్ను లోపలికి పంపెను. నాన్నగారిని చూడగానే ఆయన వళ్లో కూర్చోవలెననిపించింది హృదయంలో. యెందుకో అట్లు చెయ్యలేకపోయి నించున్నా. మెరిసే కళ్లు, చిరునవ్వు చిందులతొక్కే పెదవులు, బూరెలల్లే బుగ్గలు, ఆనందమును వెల్లడించు ముఖముచూచి, తప్పక నన్ను ఆదరణతో ప్రేమించునని అనుకొన్నా.

నావంక చూచి గుర్తుపట్టలా. తన ధోరణిలోనే పది నిమిషములవరకు వుండెను. "ఆ అమ్మాయి యెవరో వచ్చి చాలా సేపటినుంచి నిల్చున్నది. కూర్చో మననే మమ్మా చిట్టితల్లీ" అనగానే "మీ అమ్మాయి. వదినే గూడా వచ్చింది. నిన్ను క్షమాపణ కోరుతుందట. ఆమె చెప్పేది విను. పిల్లలను వృద్ధిలోకి తీసుకరావడము నీ ధర్మము." అత్తయ్య గంభీరముగా జవాబు చెప్పెను. నాన్నగారు తీక్షణంగా చూస్తూ "నాతో సంప్రతించకుండా వీళ్లను రానివ్వకూడదు. పొరపాటు చేశావు" అని త్వరగా భోజనం పూర్తిచేసి, గదిలో కూర్చొని అత్తయ్యతోను మామయ్యతోను ప్రత్యేకంగా మాట్లాడి తను వక్కడే పది నిముషములు ఆలోచించుకొని నన్నుచూచి మాట్లాడుటకు సమ్మతించెను. మామయ్యగారు తనతోగూడా గదిలోనికి తీసుకొనివెళ్లి నన్ను కూర్చోబెట్టగానే ప్రశ్న పరంపరలు.

"నీ పేరేమి? యేమి జదువుతున్నావు? మీఅమ్మ పేరేమి? మీనాన్న పేరేమి? యెప్పుడైనా మీ నాన్నను చూచావా? చూడాలనిపించిందా?" నదురు బెదురులేకుండా ఘాటుగా జవాబులు చెప్పేటప్పటికి దంగైపోయి "అన్నంతిని నిద్రపో. రేపు యింకా మాట్లాడుదాం" అని పంపేసిరి. హాల్లో సిద్ధంగా వున్న అమ్మ మాట్లాడానికి తయారైతే "భోజనాల తర్వాత" అని నాన్నగారి దగ్గరనుంచి ఖంగుమని జవాబు. ధైర్యంగా జవాబులు చెప్పినందుకు అత్తయ్య నన్ను మెచ్చుకున్నది. భోంచేసి నిద్రపోయ్యా. మరునాడు లేచేటప్పటికల్లా నాన్నగారు స్నానంచేసి పూజచేసుకుంటూవుంటే చూచి దైవభక్తిగల మనిషి నన్ను అక్కయ్యను తప్పక ఆదరించునని తోచింది. కాలకృత్యములు తీర్చుకొని నేను సిద్ధమయ్యేటప్పటికల్లా పూజనుంచిలేచి నన్ను వళ్లో కూచోబెట్టుకొని తలనిమురుతూ ముద్దుబెట్టుకుంటే నాకు విపరీతమైన ఆనందంకలిగింది. ఇదివరకెప్పుడూ యిట్లావుండలా. భుజములమీద చేతులువేసి కళ్లల్లోకిచూస్తూ "నాన్నగారూ, మీవద్ద చాలా ఆనందముగాయున్నది. మిమ్మల్ని విడిచివుండలేను" అనగానే "నన్ను గన్న తల్లీ, నాకూ అలాగేవున్నది. త్వరలోనే నాదగ్గర వుంచుకుంటా" అని ముద్దులవర్షం కురిపించారు. ఇక్కడ వీళ్లందరి ముఖాలు వికాసంగాను ఆనందంగాను వున్నాయి. ఇదివరకు చూస్తూవున్న ముఖములు తుమ్మల్లో పొద్దుకూకుతున్నట్లు వుండేవి. నాన్నగారు చాలారకాల పండ్లు తీసుకొచ్చారు. అత్తయ్య పిండివంటలు చేసింది. ఆదరణతో చూచి రెండు పరికిణీలు జాకెట్లు కుట్టించింది. వీళ్ల అపేక్షలోనే వుండాలనిపించింది. తిరిగి వెళ్ల బుద్ధిపుట్టలా. ఇంతలోనే నాన్నగారు తనపనిమీద ప్రయాణానికి సిద్ధమై నన్ను ముద్దాడి "త్వరగా మనము వకచోట వుంటాము. ధైర్యంగావుండు" అని కంటిచూపు దాటారు. నాహృదయంలో నివాసము యేర్పరచుకొని తర్వాతరోజు వుత్తరాలు వస్తూవుండేవి. నాన్నగారు మాట్లాడుతూవున్నట్లనిపించి నాలో ప్రేమ క్రమంగా యెక్కువైంది. వకనాడు అమ్మ అత్తయ్యతో "మాఅమ్మ పని చెయ్యనివ్వక గారాబంగా చూచి దద్దమ్మల్లే వుంచుతుంది. ఇక్కడవుండి పని నేర్చుకోవాలనివున్నది" అన్నది. "వదినా మిమ్ములను కూర్చగలిగా. యిక్కడేవుండి పని నేర్చుకొని అన్నయ్యదగ్గరకు వెళ్లు అభ్యంతరంలేదు. మీవాళ్లు అసాధ్యులు. మాయింటిమీదికి పోట్లాటకువస్తే వుంచుకోను సుమా" అత్తయ్య జవాబుచెప్పింది. ఇక్కడ మాట్లాడుకునే మాటలు నాన్నగారిమీద గౌరవము ప్రేమ పుట్టించేవి. "ఇంత శాంతంగా నా మొర వింటారని తెలిస్తే యిదివరకెప్పుడో వచ్చేదాన్ని. చెప్పేదంతా విని తిరిగి ప్రశ్నలువేస్తే జవాబు చెప్పలేకపోయినా. పరుల సలహామీద వారితో పోట్లాడి కాపురం పాడుచేసుకున్నా" అని కళ్లనీళ్లు బెట్టుకుంటే అమ్మను అత్తయ్య వోదార్చింది. "అయిందానికి దుఃఖపడకు. పిల్లను చూచేటప్పటికల్లా

ముచ్చటపడ్డాడు. ఇప్పుడు తెలివిగా కాపురం నిలబెట్టుకో సుఖపడతావు. లేదా పుట్టింటికి చేరుకుంటావు" వకటికి నాలుగుమాట్లు ప్రతిపని చెప్పి అమ్మచేత చేయిస్తూ అత్తయ్య మాయందు శ్రద్ధతీసుకున్నది.

సుమారు నెల రోజులు గడచాయి. "మంచి రోజు చూచి రావచ్చు"నని నాన్నగారివద్దనుంచి వుత్తరంరాగానే సంతోషంతో నా హృదయం పొంగిపోయింది. అమ్మ నిర్ఘాంతపోయి తెల్లమొఖం చేసింది. అత్తయ్య మామయ్య బుద్ధులుచెప్పి ప్రయాణంచేసి పంపిరి.

పట్నం చేరేటప్పటికల్లా ప్లాటుఫారంమీద నాన్నగారు సిద్ధం. వక్కగంటుమీద కౌగిటిలో చేర్చుకోగానే ముద్దాడి ఆబ్బిరంగా తననివాసాని తీసికెళ్లారు. ఇంట్లో అన్ని సమృద్ధిగావుండేవి. అత్తయ్యగారింట్లోవున్న చురుకుతనంపోయి పూర్వవుమ్మల్లీ ప్రవర్తన ప్రారంభించింది అమ్మ. నాన్నగారు బుజ్జగించి "త్వరగా నిద్రలే. కాల్యకృత్యములు తీర్చుకొని, తల దువ్వుకొని, నీళ్లు పోసుకొని, బొట్టు పెట్టుకొని, వంటచెయ్యి. మనము సుఖంగా వుండవచ్చు. యిక్కడ యెవరు నిన్ను ఆరళ్లు పెట్టేవారులేరు. జాగిరం పనిలోకి దూకు" అన్నారు. ఏమి వుపయోగము లేకపోయింది. "పోనిలే. యింతకాలము యేమిపని చేయక సుఖముగా తల్లిదండ్రులవద్దవుండి సోమరితనము బాగా అలవాటు చేసుకున్నావు. వెంటనే పని చేయలేవు. వకవారము అన్ని నేను చేస్తాను శ్రద్ధగా గమనించు. తర్వాత చేసితీరాలి. జాగ్రత్త" అని యింటిపని అంతయు నాన్నగారు చక్కబెడుతూవుంటే తనుమట్టుకు స్నానముచేయడము దువ్వుకోవడము చేసుకోవచ్చునా, యేమిలేదు. ఏవేళకు నిద్రలేవక అప్పుడప్పుడు కబుర్లాడుతూ ప్రశ్నించితే జవాబు చెప్పలేక తలవంచుకునేది. "మీఅమ్మకు అన్ని నిజము చెప్పావా. మన పెద్దమ్మాయిని కడుపుతోయున్నప్పుడు నాతో పోట్లాడి వెళ్లిన సైనం వాళ్లకు తెలుసునా? కలెక్టరు, జడ్జి, భర్త అయితేనే యింటిపని చేస్తావని వాళ్లకు తెలుసునా?" అని అడిగితే "అన్ని చెప్తానా యేమి. ఇప్పటికే వాళ్లనే మాటలు వినలేకుండావున్నా. యీసంగతి చెబితే పూడ్చిపుప్పనీళ్లు చల్లుతారు" అన్నది. "తెలివితక్కువదానివి. వాళ్లకు నీమీదవున్న ప్రేమకు తలవాన్న తాకట్టుపెట్టి యేకలెక్టరునో, జడ్జినో, నీకు తగినవానిని తీసుకవచ్చి సుఖపెట్టేవాళ్లుగా" అంటే "ఈజన్మకింతే" అన్నది. "ముందుజన్మలోనైనా నీ కోరిక ఈడేరునేమో" అన్నాడు.

ఒకరోజున నాన్నగారు వంటచేస్తూవుంటే సహాయముచేయ ప్రారంభించింది. "మన అమ్మాయి వివాహము వైభవముగా చెయ్యాలి నాలుగువేలు ఖర్చుపెట్టి. సిద్ధంగావున్నారా?" అన్నది. "చిన్నతల్లిని వృద్ధిలోకి తీసుకరావడానికి అంతకంటె యెక్కువ డబ్బు ఖర్చుపెడతాను. పెళ్లి యిప్పుడు చెయ్యను. బాగా చదువు చెప్పించుతాను" అని జవాబిచ్చిరి. వారిప్రత్యుత్తరము నాకు యెంతోనచ్చింది. అమ్మకు అసంతృప్తియున్నట్లు వెంటనే తెలిసింది. వారము రోజులు గడిచిపోయింది. "వంట భారము వహించ"మని నాన్నగా రెక్కడకో వెళ్లిరి. అమ్మ చెట్లకొమ్మలవంక ఆకాశమువంక చూస్తూవుంటే "త్వరగా నిప్పురాజేసి వంటచెయ్యి. నాన్నగారు వచ్చేటప్పటికి సిద్ధంగాలేకపోతే కోపము వస్తుందేమో" అన్నాను. "కావలసినవాళ్లు చేసుకొని తింటారు." "ఇట్లా అయితే నాన్నగారివద్ద యెక్కువ కాలం వుండలేనని తోస్తుంది. నీసంగతి క్రమంగా బయటపడుతున్నది. అక్కయ్యకు అంతా నిజం తెల్పి రప్పించుతా. మేమిద్దరము నాన్నగారివద్దవుండి హాయిగా చదువుకుంటాము. నీవు పుట్టింటికి చేరుకో" అనగానే చంపపెట్టి తీసింది. యేడుస్తూవుండగా నాన్నగారు వడ్డించు అంటూ గబగబా వచ్చిరి.

జరిగిన విషయం చెప్పగానే నన్ను పూరడించి యెత్తుకొని ముద్దాడి అమ్మ చవులుసాగదీసి "అమ్మాయిని యెప్పుడూ కొట్టవుగద. వంట యెందుకని సిద్ధం చెయ్యలా" అని బెదరించిరి. "నేను చాకిరిచెయ్యడానికి రాలేదు. హాయిగా అమ్మ వండిపెడితే కాలము వెళ్లబుచ్చవలదా. మమ్ములను పంపించండి" అన్నది తీవ్రంగా. "వట్టి అధమురాలవు. యెక్కడవున్నావో అక్కడ పడివుండలేక హటాత్తుగావచ్చి కాళ్లమీద యెంకుపడ్డావు. ఆరాత్రి నీ కళ్లల్లోకి చూస్తే పశ్చాత్తాపము కలిగినట్లు తోచలేదు. అమ్మాయినిచూచి ప్రేమగలిగి యిక్కడికి రప్పించాను. నామీద నీకు ప్రేమలేదని యిదివరకే తేలిపోయింది. అమ్మాయి యోగక్షేమము ఆలోచించి కుదురుగా వుండు" అని మందలించెను. తనేవంట చేసుకొని కాలము గడుపుతూవుండేవారు. వకరోజున నేను సహాయము చేయడానికి వెళ్లితే నాచెయ్యి కాలింది. "యింకా చిన్నదానివి. నీవు వంటలోనికి రావద్దు" అని వారించిరి నాన్నగారు. అమ్మ చేతికి అడ్డమువస్తూ వుండేది. ఇంట్లో సామానంతా మధ్యగా అమర్చేది. నాన్నగారు కోపంతో విసుగ్గోడం పరిపాటి అయిపోయింది. మేము వారివద్దవుండడం పదిహేను రోజులు అయిందో లేదో యిల్లు దొంగలకుబెట్టి దాదాపు వందరూపాయలు నష్టంచేసి శోకాలంపెడుతూవుంటే నాన్నగారు బహుశాంతంగా ధైర్యంగా అమ్మను ఓదార్చారు. "నేను బంగారం పట్టుకుంటే మన్ను అవుతూవున్నది. మీదగ్గర వుండలేగను. మావాళ్ల యింటికి పంప"మని యేడ్చింది. "నీవు పొరపాటున తలుపులకు తాళాలు వేయకపోతే దొంగలు అన్ని యెత్తుకపోయినారు. అందుకని నిన్ను వేధించడములేదు. ఇంట్లో పని బాగాచేస్తూ సరీగావుండు. చురుకుతనం అలవాటుచేసుకో" అని బుద్ధులు చెప్పిరి. ఎప్పుడు దుఃఖములో తన్ను తిట్టుకోవడం, పని చేయక నాన్నగారిని విసిగించడం సాగించింది. "మీరు అమ్మాయిపెళ్లి నా యిష్టప్రకారం చెయ్యకపోతే మావాళ్ల యిష్టానుసారంగా యెటువంటి వెధవైనా సరే నా రెండోతమ్ముడికిచ్చి ముడివేస్తాను. మునుపు మీకు తెలియకుండా పెద్దదాని వివాహముచేయడం వల్ల వెంటనే దానిభర్త పరలోకగతుడాయెను. ఈ మాటు మా అమ్మ పట్టుపట్టింది. యెట్లాగైన మిమ్ములను లొంగదీసి పీటలమీద కూర్చోపెట్టి తీరుతుంది" అనగానే కళ్లు యెర్రచేసి "మీ అమ్మపట్టు మీ నాన్నదగ్గర సాగుతుంది. వెనక నీకు సలహాయిచ్చి నాతో పట్టుసాగించుకోలేక ఆట యెదురుతిరగడం మరచి మళ్లీ నిన్ను పంపిందా ఇంకా మూర్ఖత్వం వదల్లా? యాత్రలు చేసిందని విన్నా తమోగుణం అవరించుకొనియున్నదే. ఇకమీద యీప్రసంగం నావద్ద లేవద్దు" అని గట్టిగా చెప్పిరి.

నాకు శ్రద్ధగా పాఠాలు చెప్పించుతూ వచ్చారు నాన్న. నాన్నగారికి చాలామంది స్నేహితులున్నారు. వాళ్లు తరచుగా విందులు చేసేవాళ్లు. నేనుగూడా వెళ్లేదాన్ని. చాలా మర్యాదగాను ప్రేమగాను చూచేవాళ్లు. యిక్కడవుంటే అంత స్వర్గంలా వున్నదని అక్కయ్యకు వ్రాసా. యేదిగావలెంటే అది కొని యిచ్చేవారు నాన్నగారు. నాకు యిక్కడే వుండాలని గట్టిగా వుండడమువల్ల అమ్మను బతిమాలుకున్నా.

"వేళకు వంటచేసి పెడితేతిని తన దోవను పోతారుగా నాన్నగారు. శ్రద్ధగా పనిచెయ్యి. మనము యిక్కడే వుందాము."

"ఈ కూరలు మిఠాయిలు నాకేం బాగాలేవు. హాయిగా యింత గోంగూర చింతకాయ, కారము, వేసుకొని కమ్మగా చేసిపెడితే తిని సుఖపడలేక యిరక్కపోయి యిక్కడికి వచ్చా. పోదాంపద అమ్మమ్మగారి యింటికి."

"నువ్వుపో. నేనురాను. నీమూలకంగా నేను అక్కయ్యగూడ చెడిపోతాము. యిక్కడవుంటే మేముతప్పక వృద్ధిలోకి వస్తాము." ఈ సంభాషణ జరిగిన తర్వాత

అమ్మతో మాట్లాడడం తగ్గించేశా. పిలిస్తే వినిపించుకోకుండా వుండేదాన్ని. ప్రతిరోజూ తన పుట్టింటికి పంపమని నాన్నగారిని కోరుతూ వుండేది. వారు నవ్వి కథ కట్టిపెట్టమనే వారు. ఒకరోజున "నన్ను చీచ్చి దానికింద కట్టేసి మీ యిష్టమువచ్చినట్లు మొగరాయుడికి మళ్లే పిల్లకు చదువు సాగిద్దామని తలచినట్లున్నది. పిల్లలను ధారాగతం చేస్తాననుకున్నారేమో యెట్లా వచ్చామో అట్లా వెళతాం. అడ్డు చెప్పారా భావిలో దూకి మిమ్ములను సకల యిబ్బందులను తీరుతా. ఆలోచించుకోండి". అనగానే తోక తొక్కిన తాచుమల్లే లేచి "అల్లాంటి మొండి దానివి యెందుకొచ్చావు. వెనుక భావిలో పడతానంటే అయిన శాస్తి మరచిపోయావా? మీయమ్మ మంచి విద్యే నేర్పి పంపింది. చావదలచిన దానవు మీ వాళ్ల యింట్లోవున్న భావిలో దూకలేకపోయావా? యిట్లాంటి దానివి నావద్ద వుండ తగవు తక్షణం నాగడప దాటు. మూడోమాటు నా నెత్తురు నానోటపోసి కొట్టావు. వెళ్లిపో". అని గట్టిగా అరచారు. అందరికన్నా బలవంతుడు రాజు. రాజుకంటె బలవంతుడు మొండివాడు. నేను రానని రాగాలు పెట్టి యేడుస్తుంటే మా నాన్నగారు దుఃఖములో చూడలేక పడిపోగా నన్ను యీడ్చుకొని పుట్టింటికి చేరింది. నాన్నగారి మీద అన్ని అబద్ధాలు కల్పించి వాళ్ల వాళ్లతో చెప్పింది. జరిగింది జరిగినట్లు అంతా నేను చెప్పేశా. "శుభ్రంగా కాపురంచేసుకో లేక మాయిల్లు ఖట్టావు" అని వాళ్లు నిందించారు. బయట మొఖం పెట్టలేక యింట్లోనే ఒకమూల పడివుంటుంది. మా అక్కయ్యరాగానే విషయం అంతా చెప్పాను. మా నాన్నగారి దగ్గరకు వెళ్లి బాగా చదువుకుంటూ వృద్ధిలోకి రావలెనని తీర్మానించుకున్నాము. తీసుక వెళ్లటానికి వారువస్తే వీళ్లు అడ్డగించారు. శారదా చట్టము సవరణకాబడ్డ యీ రోజుల్లో సహితము బలవంతంగా యే అర్ధరాత్రి లగ్నానికో వాళ్ల మూడో వాడికిచ్చి వివాహం చేద్దామని పన్నాగాలు పన్నుతున్నారు. నాకు మా నాన్నగారికి, అక్కయ్యకు, యిష్టములేకుండా పెండ్లి చెయ్యాలని ముసలివాళ్ల పట్టు. మా అయిష్టము తెలుసుకోగానే ఆ తెల్లమొఖం వాడు కాస్త తెలివితెచ్చుకొని దూరుకున్నాడు, యెక్కడో చాకిరి చెయ్యడానికి. పెళ్లికి పూర్వము రజస్వలనైతే వాళ్లకొంప కూలిపోతుందేమోనని తారుపడేవాళ్లు. నన్ను మా అక్కయ్యను రైలెక్కిస్తే మా నాన్నగారి దగ్గరకు చేరుకొని హాయిగా వుంటాముగా. తమరు మూర్ఖులు కావడంవల్ల యితరులనుగూడా అట్లా వుంచాలని ప్రయత్నం చేస్తారు. విద్యా వికాసములేక మొండిపట్టు పడితే సంసారాలు ధ్వంసం. లేనివాళ్లు లేక యేడుస్తూ వుండే వాళ్లగతి యిట్లావున్నది. వీళ్ల దగ్గరవుంటే ముళ్లమీద వున్నట్లున్నది. ఏనాటికి దారి తీస్కొని మా నాన్నగారివద్దకు చేరుకొని హాయిగా చదువుకుంటూ వృద్ధిలోకి వస్తామా అని ఆదుర్దాలో నిమిషమొక యుగముగా గడుపుతున్నాము.

# కాశ్మీర మజిలీలు

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు

(నాటి రేయి)

బోండామనుమరాలు కాబోలు పదేండ్ల బాలిక చిన్నపళ్లెములో కొన్నికిళ్లీలుంచి గుమ్మముకడ నిలిచినది. ఆరాత్రివేళ బాలిక కూడ అతిథిసత్కారమున నెట్లుపాల్గొనుచున్నదో! ఆశ్చర్యముతో ఆనందముతో నామనస్సు నిండిపోయినది. ఆమెను చూడగనే వెనుక భటిండాలో పరిచితమైన సురుచ్ జ్ఞప్తికివచ్చినది. ముద్దుతో ముచ్చటతో బాలికను పలుకరించి "అదేమి? అమ్మా!" అని ప్రశ్నించితిని. "పాణ్ లీజియే" ("తాంబూలము తీసికొనుడు") అని ఆమె ప్రత్యుత్తరమిచ్చినది. వసారాకును వీథి గుమ్మమునకును నడుమగల చిన్నిహాలులోని చాపపై బోండాచతికిలపడి "బైఠియే" యని నన్ను ఆహ్వానించినాడు. "అచ్ఛా!" అని యిరువురకు ప్రత్యుత్తరమొసిగి బోండాకెదుట చతికిలపడితిని. బుడంకాయికూడ చాపపై చేరినాడు. పళ్లెమును బాలిక మామోలనుంచినది. ఆపల్లెలో వారికి తమలపాకు లెట్లు లభించినవో! బాలికను సమీపమున కూర్చుండ బెట్టుకొంటిని. ప్రక్కగదిలో బోండాభార్యా అక్కా కూర్చుండిరి. మామా ప్రాంతాలనుగురించిన ప్రసంగములు జరిగినవి. ఈ అమాయికులకు ఆధ్యాత్మికవిషయములే రుచించునని యెఱుఁదును. రామచంద్రుడు మా ప్రాంతాలలో ముసలినాడనియు గోదావరి నాజన్మస్థలమునకు సమీపమందేయున్నదనియు రామేశ్వరము మా కెంతో దూరమునలేదనియు యాత్రార్థమై మాప్రదేశమునకు రండనియు నేను పలికినంతనే వారు పరమానంద భరితులైరి.

ఆహా! ఎట్టి పవిత్రజీవులు! రామచంద్రుడనినంతన గోదావరి యనినంతన రామేశ్వరమనినంతన వారి ముఖములందు పవిత్రమైన తేజస్సు తళ్కొత్తినది! సూర్యునిలో ఉజ్జ్వలమైనకాంతి వెలయునట్లు, విశ్వాసమందు సద్భక్తి యొప్పుచుండునుగదా! సంశయాత్ములమైన విద్యాధికులము వాదప్రతివాదములు సలుపుచు భూమ్యాకాశముల నడుమ నలాడుచుండ నమాయికులైన ఈ పల్లెవాసులు విశ్వాసమును భక్తిని రెక్కలు జేసికొని రివ్వురివ్వున స్వర్గ వీథులలోని కెగసిపోగలరు. "పల్లెలకు తరలు"డని పెద్దలనుచుందురు. "తరలుట ఆర్థికసమస్యాపరిష్కారమునకుగాక ఆధ్యాత్మిక విద్యాభ్యాసమునకై "అని నేను కంఠమెత్తి వచింతును.

మేము ప్రసంగించుకొనుచుండగా గృహిణి లేచి దొడ్డి వసారాలోనికిపోయి కుంపటినిండ నిప్పులుపోసి మాకనతిదూరమున బెట్టినది. చలితీవ్రముగను, ప్రత్యేకించి మాకు దుస్స

హాముగను ఉండుట ఆమె గ్రహించినది. ప్రశాంతమైన ఆసమయమున పవిత్రచిత్తులైన ఆపల్లెకుటుంబస్థులతో ప్రసంగించుచుండగా నామనసున అపూర్వమైన భావస్రవంతి ప్రవహించినది. హృదయమున నిహితమైన శక్తులకును, పల్లెవాతావరణమునకును ఎంత దగ్గఱిచుట్టఱికము కలదో! నగరములందన వరతము వినబడు కర్కశశబ్దములుకాక పల్లెలందు వినబడు పిల్లతెమ్మెరల గుసగుసలే ఆత్మనలరించి, అంతరంగమున నిదురించుచుండిన శక్తులను లేపునని గ్రహింపగలిగితిని. కడుపున నొకభావము నిడికొని నాల్కనుండి వేఱుమాటను జారవిడచు నాగరకుల ప్రోలనున్నపుడు మనసునకు దురంతమైయాతన కలుగుననియు, కల్మషరహితులైన జానపదులు హృదయములు విప్పి ప్రసంగించుచుండ నెదుటనుంటిమేని, నుదువుల కందనిహాయి, నందనమునమసలు పరిమళమువలె, మనసున నడయాడుననియు స్వానుభవమువలన దెలుపగలను.

మేము ఇష్టాగోష్ఠి సలుపుచుండగనే పొట్టి పిచికి చాపపై వ్రాలి నిదురించినాడు. భోండాలేచి మాకై రెండు మంచములను అందు వేయబోయినాడు. "మంచములు వలదు అరుగుపై పరుందుము. రగ్గులున్నవి చలిభయములే"దని పలికితిని.

అనంతరము మేము మాప్వరము అవ్వలి కరిగితిమి. అరుగులపై నేదో రొట్ట దట్టముగా పడియున్నది. కుడి అరుగుపై రొట్టలోనే భోండా వెలికిలబడి "బాబూజీ! నేను ప్రతిదినమూ యిందే పరుందును. ఆ అరుగులపై మీకు మంచములు వేయింతును" అనినాడు. భోండా పద్ధతినే అవలంబింపవలెనని మక్కువ పడితిని. స్వస్థలమైన పేరవరమును వీడకమున్ను రాత్రులందు నాతండ్రిగారితో పొలములందు విడియు వాడను. ఒత్తుగ గడ్డిపఱచి పాలేరులు మాకు శయ్యనేర్పఱచువారు. దానిపై వెలికిలబడి, నిస్తబ్ధనిశీథినీ సమయమున నీలాకాశమున వెలయు నక్షత్రముల నవలోకించుచు, చల్లని పిల్లవాయువు శరీరమును స్పృశించుచు నంతరంగమున నెంతో హాయిని బుట్టించుచుండ నల్లన దాని ననుభవించుచు, అసంఖ్యాకములై కూడియు నించుకంతైన రొదజేయక అంతరిక్షమున తారకలు నోళ్లు మెదల్పని తాపసులట్లు ఏల, ఎట్లు వసించుచున్నవో యని తలపోయుచు, ఎంతో దూరమున నొకొక్క దిక్కునుండి అపుడపుడు పక్షికూజితము చెవిబడినపుడు ప్రశాంతమైన ప్రకృతి గృహమున నదెట్టి సుఖజీవితమును కడపుచున్నదో యని యూహించుచు, అదూరమున వెన్నెలలో నిలిచి, భావమననము గావించుకొను కవి మానసమువలె, నెమరువేయుచుండు పశువులగుంపు జూచుచు, ఒకొక్క ముహూర్తమున పాలేరు పాడు ఏలపాటకు వీనులొగ్గి గంగోత్తరినుండి జాలువారు పూతధారవలె నిర్మలినమైన వాని గుండెనుండి వెలారు మధురస్వనమందలి మహత్త్వమునకు జోహార

నుచు, మేల్కాంచియే ఆనందస్వప్నము లల్లుకొనుచు, బ్రతికియుండియే స్వర్గసుఖము ననుభవించుచు, నొకప్పుడు నేను కడపిన దినములు జ్ఞప్తికివచ్చి నా స్మృతిపథమున నానందలహరిని ప్రవహింపజేసినవి. ఆహా! స్మృతి ఎంత మధురమైనది! ఎంత మహిమోపేతమైనది! బాల్యమున ననుభవించిన నాహాయి కలకత్తా మహానగరమున ప్రవేశించినంతనే కడతేఱినది. దేశభ్రమణము సలుపుతఱి కొండలందును, వనములందును, పొలములందును, పల్లెలందును విడియు తరుణములు లభించినపుడు మరలనట్టి హాయిని జుఱ్ఱువాడను. పఠితలు మానసికముగ నన్ననుగమించిరేని, కాలక్రమమున వారి నీ ప్రదేశములకు గొనిపోదును. ఈ యుదంతమును చదువుతఱి ఆంతరంగికముగ వారు హిమగిరి దృశ్యములందు విడియుదురని, పచ్చని చేలందు, చక్కని తోటలందు, మంచెలందు, ప్రశాంతములైన పల్లె ప్రాంగణములందు మానసికముగ పన్నుండి హాయినందెదరని ఆశపడుచున్నాను. నాటి ఆనందమును దలపోసి, మంచముపై పరుండుటకంటె బోండావలె రొట్టమీదనే పరుండుట మేలని గ్రహించి "మంచములు వలదు. రొట్టలోని హాయి నెఱుగుదు"నని పిన్ననాటి యుదంతమును సంక్షేపముగ వానికి దెలిపితిని. నానిశ్చితము నెఱిగి, బోండా అచ్చెరువొందినాడు. అతని అక్కాయిల్లాలూ ఇంచుక దుఃఖించిరి.

వారేమి అనుకొనినఅనుకొనెదరు గాక! నాటిరేయి అరుగుమీది రొట్టలోనే మేను వాల్చితిని. లోనుండివచ్చి, పొట్టి పిచిక అరుగుమూల ఒరగినాడు.

# అక్క జెల్లెండ్ర లేమి

అక్కయుదమ్ముడునుగూడి యడుగులిడుచు, హస్తములు హస్తములజేర్చి యాటలాడి
సొంపునొయ్యారమును గనులార నింపునొంద, సంతసముగల్గదెవ్వారి స్వాంతములకు!
అక్కదమ్ముడు నుయ్యెలయందు జేరి, పాటబాడుచు నూగుచు నాటలాడ
తల్లిదండ్రుల చిత్తముల్ దనివినొంద, చూచువారికి సంతుష్టిదోచుగాదె!
అన్నదమ్ములుగల సౌఖ్యమబ్బుగాక, భోగభాగ్యంబులును హెచ్చుపొసగుగాక
పృథ్వినలరించు భార్యలభించుగాక, అక్కచెల్లెండ్రు లేకుండు టార్తిగాదె?
అక్కచెల్లెండ్రు పురుషున, కన్నదమ్ములాడు వారికి, లేకున్ననవనియందు
సోదరీసోదరప్రేమ సుఖమెఱుగని, కొఱతచే జీవితంబెల్ల కుందు చుండ్రు!
పేదలై బొట్టగూటికి పెనగులాడు, మనుజులోకపు సంపదల్ బడయువచ్చు
సోదరీసోదరులు లేనివేదనంబు, బాపుకొనుటకు వశమె ఎవ్వానికైన?

— దేవీ మూర్తులు.

# దసరా గృహలక్ష్మి

## ౧

### శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు

మొన్న అక్టోబరు రెండవ తేదికి "మా దసరా సంచిక గృహలక్ష్మి" వచ్చింది. వచ్చీ రావడం తోనే ఇరుగు పొరుగు సోదరీమణులందరు మాకోసారిమ్మంటే, మాకో మాటిమ్మని, ఆత్రుతగా అడగడం మొదలెట్టారు. 'నేనింకా చూడైనా చూడలేదు. మీ యందరికీ చదవాలని ఎంత అభిలాషగాయుందో నా కంతకంటె తొందరగాయుంది. గనుక, అందరం మధ్యాహ్నం తీరుబడి సమయంలో ఒక చోట కూర్చొని చదువుకుందాం. రమ్మ'న్నాను. అందరూ సరే అని తలలూపి వెళ్లారు. 'గృహలక్ష్మి' మీదుండే మోజుచేత, వంటలు, భోజనాలు త్వరగా తెముల్చుకొని వచ్చేసారు. ఒకరు చదువడం, అందరూ వినడం ఈలా ఏర్పాటు చేసుకున్నాము. ఎవరు పుస్తకం వాళ్లే చదివితే బాగుంటుంది, నలిగినా తొలగినా, మాకు బాధ్యతుండదు. నన్నే చదువమన్నారు.

ఆ ఏర్పాటుగా మాకున్న మధ్యాహ్నం రెండు, ఐదు మధ్యయున్న ఖాళీలో, రెండు రోజులు చదువుకున్నాము. అక్కడనుండి, సంభాషణ లారంభమయ్యాయి. విన్నవారి అభిప్రాయాలన్నీ ఇమ్మన్నాను. "పుర్రెకొక గుణము, జిహ్వకొక రుచి" యన్నట్లు, మూడు వంతులు మంది పాత ఆచారాలతో యుండే దసరా కథలు, అంటే, "మనవద్దనేగా వాళ్ల మురిపాలు" అన్న కథలాంటివి మెచ్చుకొన్నారు. కొంచెం ప్రపంచ పరిస్థితులు, కాలమార్పులు గమనించిన సోదరీ రత్నములు, 'ఇల్లలుకగానే పండుగా' అని గడపలకు పసుపు కుంకుమలు, గోడలకు వెల్లవేసినంత మాత్రాన పండుగనిపించునా. ఇంట్లో డబ్బు శక్తి, వంట్లో చాకిరిచేసే త్రాణయుంటేనే లక్షణంగా పండుగ వెడుతుంది కాని, స్త్రీల మూర్ఖత్వానికి, అవివేకానికి నిందలుపొందుచూ, పతి జేబులో డబ్బులేకపోయినా పండుగ చేయాలన్న పట్టుదలతో, మగనిచే చివాట్లుతింటూ, ఓ కంటా ఏడుస్తూ, మూతి ముడుపులతోటి, అలకలతోటి ఆ కాస్త పండుగ రోజులు వెడితే ఏలా యుంటుంది! అందుచేత, ధనవంతులకి పండుగ, దరిద్రులకు ఎండుగ, అనే ద్వందయోగాలు పోయేవరకు, కాలానుగుణ్యంగా బుద్ధులు మార్చుకొని, ప్రస్తుతం కావలసిన, దేశ సౌభాగ్యం వంక దృష్టి మరల్చాలన్న, పండుగ కబుర్లన్న కథలాంటివి బాగున్నా'యని అన్నారు.

నాకో యిద్దరు ప్రాణచెలులున్నారు. ఒక ఆవిడ కొంచెం సామాన్య సంసారిణి నావలెనే. ఒక ఆవిడ మాకంటె అంతర్వర్ణరాలే కాని, ధనశాలిని, ఉదారశాలిని. ఆవిడ, ఈవిడ ఇక విమర్శించాలి. సామాన్య సంసారిణి అన్నది. శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారి "విందు ముచ్చట్లు" కథ బాగుంది. మన స్త్రీలకిది నిత్యానుభవమే కదా? ఏదో ఒక భోజనమో పేరంటమో మనకు తగుల్తూ ఉంటునే యుంటుంది. వెళ్లేటప్పుడల్లా రవికలగుడ్డల తగువు పట్టుకెళ్లే ఆచారం మన్నిమహా బాధపెట్టుతూనేయుంది. ఓనాడు పెళ్లి భోజనానికి వెళ్లాలిసొచ్చింది. వాళ్లునాకు దగ్గర బంధువులు. మా అమ్మాయి పెళ్లికి, పిల్లకి చీర రవిక, వెండి కుంకంబరిణె తెచ్చారు. ఇప్పుడు వారింటికి వెళ్లాలి. వాళ్లు డబ్బున్నవాళ్లు గాన, అన్ని తెచ్చారు, నేను తిరిగి చీరలు భరిణలు యియ్యలేను. ఆఖరికి ఒక్క పావలా చీటిగుడ్డ తెమ్మన్నా మావారు తన వద్ద లేదన్నారు. స్త్రీల ఆర్థిక దుస్థితి, చేతకానితనం, వారసత్వపు హక్కులులేని జీవిత దుర్భరం అప్పుడు నాకు మనస్సుకు ముల్లులా నాటినది. ఛీ! ఒకరిని కానికికూడా ఆశించే చేతకానితనం గల స్త్రీలమైపోయాంకదా? పేరంటానికిప్పుడు వెళ్లనా! మాననా?

వెడితే ఆకథలో చెప్పినట్లు నలుగురిలో సామర్ధాగా యుంటుంది. మానితే దగ్గర బంధువులతో పని బాగుండదు. ఇల్లా చిక్కుకున్నాను. తటపటాయించాను. బదులడిగితే మాత్రం తీర్చే దెట్లాగ? అప్పుడైనా మగాళ్లనే అడగాలికదా? లేకపోతే కొందరు దుష్ట స్త్రీలు చేసినట్లు ఇంట్లో ఖర్చుల కబద్ధమాడి మిగిల్చి తీర్చాలి. ఆ వెధవ పద్ధతి నాకిష్టములేదు. ఇలా తలుస్తూ, సాయంకాలందాకా దాటేశాను. కాని బంధువులవడంచేత తిరిగి రమ్మని కబురొచ్చింది. ఇక వెళ్లకపోతే బాగుండదు. ఇంతలో దైవఘటన ఎల్లా కలిగిందో చూశారా! మా పొరుగమ్మ కాశీ యాత్ర చేసుకొచ్చింది. అప్పుడే వచ్చి ఓ గంగచెంబు, ఒక రవికలగుడ్డ, అన్నపూర్ణ విగ్రహం, కుంకం పొట్లము యిచ్చింది. బ్రతుకు జీవుడా అనుకొని, ఆ విడకో నమస్కారంచేసి, ఆవిడిచ్చిన రవికలగుడ్డ పట్టుకొని, పెరటిలోయున్న చెట్టు కొబ్బరికాయ తీయించుకొని ఆనాటి పేరంటం పేచీ వదల్చుకున్నాను. ఇల్లాంటి ఘట్టాలు మన జీవితంలో చాలసార్లు సందర్భపడుతూ యుంటాయి. అస్వాతంత్ర్యపు హక్కులులేని స్త్రీల బ్రతుకిట్టి స్వల్ప విషయాల్లోకూడ ఎంత దుర్భరమో చూడు, పెరట్లో కొబ్బరి చెట్టుంటే, పళ్లు కొనడానికి డబ్బులేని స్థితిలో ఫలదానంచేసి, ఉపకరించింది. అల్లాగే, చేతిలో, అర్థలాభం కలిగే, ఓ చేతిపనో ఆర్జించడానికి ఒక లలితకళో యుంటే, మనకెంత లాభం. మనం ఒకరిని అడగవలసిన దుస్థితి రాదుకదా? లేనిదానిని కాన, అర్జనా విషయం స్వతంత్రం కావలెను. ఉన్న సోదరీమణులకు ధనార్జన అన్న విషయం అపఖ్యాతిని, అభిమానం. అట్టివాళ్లకు వారసత్వపు హక్కులులేక చేతిలో పైసాయుండదు. ఇవ్వని, మగడు, పెట్టని తండ్రి ఆయాక, కుటుంబం గొప్పలెందుకు, అట్టి స్త్రీలు నిర్ధనులే. మొత్తంమీద, స్త్రీలకు కూడ స్వతంత్ర ధనం కావాలన్నమాట ముఖ్యాంశము. అప్పుడు కాని స్త్రీల కన్నీరు కట్టదు. దానిపైనకాని, దేశక్షేమం, లోకసౌఖ్యం, కుటుంబానుకూలము కాదు. గనుక, ముందుగా, ఆర్థికసమానత్వం కలిగేవరకూ, పాతాచారాలు, అన్నీ అనికాదు, మూర్ఖతగా, విమర్శనముగా కాకుండా పట్టుకు ప్రాకులాడే మూఢాచారాలు మానిపోవాలి. ఇచ్చి పుచ్చుకునే రుణపద్ధతులూడాలి. అంతకు మనం, మన సంఘం మన ఆచారం వచ్చేవరకు, అట్టి కథలే వ్రాస్తూ హెచ్చరిస్తూ యుండాలి. ఖండనగా ఉపన్యాసా లిప్పుచుండాలి. మనస్సులు మార్చుకోవాలి. అభిమానం వదలుకోవాలి. ఆక్షేపణలంతరించాలి. మాబోట్లకు హాయికలుగాలి అన్నదాచెలి. దానికందరం ఆమోదించాం. ఈపాత ఆచారాన్ని మొదటికే ఛేదించాలంటే కరపత్రాలు పంచిపెట్టాలి, ఎవరో ఒకరు ముందడుగువేసి, విందు కార్డులలోనే అందరికి తెలిసేలాగ, ఈవిషయం తెలియపర్చాలని అక్కడచేరిన పదుగురం తీర్మానించుకున్నాం.

అంటే, మా దసరా గృహలక్ష్మి పండుక్కు మా యింటికొచ్చి తన బోధవలచే, మాపదిమందిలో సంఘలోపము చూపి, దిద్ది, సంచలనం కలిగించి, ఆడబడచులు, అల్లుళ్లలా డబ్బు ఖర్చుచేయించి వెళ్లకుండా, స్త్రీలకొక నీతి నియమం, కట్టుబాటు చేర్పిందన్న మాటని నేన్నాను. అందరూ నవ్వి, అందుకనే ఈ 'గృహలక్ష్మి' మనందరికి ఆడబడుచే. డబ్బు దోచకుండా, మన స్త్రీలకు ఉన్నతి చెప్పే ఆడబడుచు, నెల నెలా వస్తేమాత్రం యేతంటూ యుందన్నారు.

ఇక ధనశాలిచెలి అభిప్రాయం చెప్పాలి. ఆవిడ పట్టిపట్టి అభిప్రాయాలు చెప్పేరకంకాదు. ఆదర్శమణి. చేసిచూపించేసతి. మణి అంటే అన్నిటిలోను ఉన్నత స్థానార్హురాలకు అర్థము. ఆమె నామంకూడా రత్నమణి.

ఆవిడ దీనులకు దిక్కులేనివారికి మంచిసమయములో తోడ్పడి వారిలోని శక్తులను విజృంభింపచేసి స్వయంపోషకులనుగా చేస్తూవుంటుంది.

ఆవిధకు వలె సుహృదయపరివర్తన కావాలి, మన సంఘానికిప్పుడు అట్టి సమానాభావ మవసరాలి. ఉచ్ఛనీచాలు, భాగ్యదారిద్ర్యాలు, సౌఖ్యా సౌఖ్యములు, సుఖదుఃఖములు, కలిమి లేములు, స్వాతంత్ర్యా అస్వాతంత్ర్యములు, గౌరవా గౌరవాలు అనే ద్వంద భావాలు మనలో వదలాలి. మతకక్షలు మాయాలి. స్వార్థపరత్వము చావాలి. అప్పుడు దేశమోక్షం కలుగుతుంది. సంఘలోపాలు సవరింపబడతాయి. గృహ కల్లోలాలణగుతాయి. సగుల కన్నీళ్లు కట్టి సౌఖ్యానందాలు వర్ధిల్లుతాయి. శాంతిస్థాపన అగును. ఇంత మార్పు కలగాలంటే వ్రాసే వ్రాతలు, చెప్పే ఉపన్యాసాలు, నడిచే నడవళ్లు మారాలి. విమర్శన జ్ఞానంతో ప్రతీఅడుగూ ముందుకు వెయ్యాలి. ఆచరణ, ఆదర్శము ఈ రెండే కావాలి. పత్రికాధిపతులు విలేఖర్లచే సంఘపరివర్తక, దేశక్షేమ, స్త్రీకళ్యాణ విషయ వ్యాసాలే వ్రాయించాలి. నాయకులు మహాసభలలో లోకానికి ప్రబోధించాలి. మాధ్యాచారాలు మాటలలో ఊడకపోతే శాసనసభ్యులు చట్టాలు చేయించి సరీవదలించాలి. అప్పటికి సంచలనంకలిగి మార్పుకలిగి స్త్రీల కానందసౌధ మమరుతుంది. ఆర్థికలాభం కలుగుతుంది. ఇందు కెన్ని సంవత్సరాలు పట్టునోయని చే సన్నాను.

మారత్నమణి తన్న నలుగురిరొమసట పొగడుట సహించక "నావిధి చేనుచేస్తే నన్నింత ఎత్తు ఎత్తడ మెందుకని" పరోపకారార్థమిదం శరీరమ్మని స్రష్ట సృష్టిచేస్తే విధిశాసనం మీరుట అవివేకం తప్ప కాని విధివిధానా లాచరించుటలో గొప్పేముంది" అంది వినయంగా తలవంచి.

మళ్లీ దసరాసంచిక వ్యాసవిమర్శ వొచ్చింది. ప్రస్తుతంలో కావలసినవి, లోకమార్పుల కవసరమైనవి, మనమిప్పుడు చర్చించుకున్నవి. అన్నివిషయాలుకూడా దరిశి సుభద్రమ్మగారి "భారత స్త్రీలఉద్యమము–భావ పరిణామము" అన్న వ్యాసంలోయున్నాయి. అల్లాంటి రచనలేమనకిప్పు డావశ్యకం" అంది మణి. మన స్త్రీల గ్రుడ్డినమ్మకాలచే కల్లు మోసాలకీ "వంచన, మోసం, మాయ" అనే భాగవతుల లక్ష్మీకాంతమ్మగారి వ్యాసం బుద్ధి చెబుతోందంది ఒకావిడ. మరల పదిమంది ఆమోదంపడిసింది "విదేశీ వైరబిడితే" అన్న కె. సుగుణమణిగారి సుగుణప్రబోధిత వ్యాసం. అట్టి పరిశ్రమలు ధనవంతులు పెట్టుబళ్లుపెట్టి బీదలచే చేయించి ఉపాధికలిగించియు స్వదేశ వస్తుసమృద్ధి కలిగించి విదేశీవస్తువైరులు వదల్చాలి అని తీర్మానించాము.

"లక్ష్మి" అన్న అలివేలుమంగాదేవిగారి కథా వ్యాసం కార్మిక స్త్రీల దుస్థితి బాపుట కుపయోగించును. మిల్లుదారుల రాక్షసత్వంపై దాడివెడలి, లిమిటెడ్ కంపెనీలగాచేసి తీరవలసిందే. చూలింత నేడవమాసమునుండి బాలింతకు మూడవమాసం వచ్చేవరకూ విశ్రాంతినిచ్చి జీవితానికి జీతంఏర్పరచే పీలైనా కలుగజేయాలి.

తరువాత, ఆచారములన్న పింజమూరివారి వ్యాసం లాంటివి చాదస్తాచారాలనే అనుసరించే గ్రుడ్డితనాన్ని పోగొట్టగలవు. ఇన్ని శక్తులు కలిగించి జీవితాన్ని వికసింపజేసేదే విద్యావిధానం కాన ఆవ్యాసం గణనీయమే.

కామరాజు మైత్రేయిగారి వ్యాసం గృహమును భూతలస్వర్గంగాజేసి ఆస్వర్గంలో దంపతులిద్దరూ కూడ, దేవేంద్రవైభవం పొందేచక్కని నడవడి గృహిణీలోకానికి నేర్పుచున్నది. హిందూపవిత్రత నిలబెట్టుకొనే నేర్పుచూపించినది. ఇట్టివ్రాతలే మన కిప్పుడుకావాలి. ఏవిషయమైనా అమితమై,తలమునిగినప్పుడుమళ్లీ సనాతనంవైపు కొంచెందృష్టి మళ్లిస్తేనే కాని, మరీసాగరతకతా సముద్రంలోమునిగి అడుగంటుతాము. కళాపోషక గాన విద్యకున్నతస్థానాలుకలుగచేయున్నవి. వాటికిపేటేట జరుగు, స్త్రీలగాన సభలు ప్రదర్శనాలు తార్కాణం, కాని అందరికి

కులభసాధ్యంగాకుండా ధనాధికంతో కలిగేగాన విద్యామఖదులలో పఠనీయగంటగా, ఉచితంగా నిర్మించితీరాలి.

స్త్రీలనుమంగళీ చిహ్నమనగు, పసుపు కుంకుమలకెక్కుడు ప్రాధాన్యమిచ్చి, విదేశీ సబ్బు, పౌడర్ల వైరివ్యామోహం మాన్పించి, తద్వారావిదేశానికి ప్రవహించు, ధనప్రవాహ మరికట్టి స్వంతవస్తువుల ఆరోగ్య విలువలు తెల్పు, అనండి భూలక్ష్మీదేవిగారి వ్యాసరాజము ప్రశంసనీయము.

వృద్ధాప్య, అతిబాల్య వివాహాలకు చట్టాలేవచ్చాయికదా? ఇక దౌర్భాగ్యసంఘం అంతరిస్తుందేమో. అయేవర్కు ఆందోళనలు అవసరమే. అట్టి అననుకూల దాంపత్యాలలో పాతివ్రత్యం పతితమైందంటే ఆశ్చర్యము కాదు. ఆసంగతి, డి, ఆవమాయగారి వ్యాసం సమర్థించింది.

వెన్నెల్లోకథ యవ్వన యువతీయువక ప్రణయ మోహాలకే పనికివస్తుంది కాని, మాబోటి, బిడ్డలతల్లుల కర్థముకాదు.

మతపట్టుదలలో, ఘోరాతిఘోరకర్మలు చేయుటకైనా వెనుదీయని, మతేతరులకు, దయారస, అహింసాప్రవత, ద్రవీభూత హృదయాలుగల, శాంతతత్వబోధితాను సరణీయులకును, సౌఖ్యత, చెలిమీ కలిగించి, దేశశాంతిని కలిగించుటకు, తూర్పుపడమర్లేకం కావలెను. స్వభావం మార్పుటకు, బట్టతల పోగొట్టుటకు మందే లేదు. నాయకుల చేకపాట్లు, మాడికుదుతమ్మగారి 'హిందూ మహమ్మదీయ సఖ్యత'కై పడుచున్నారు కాని, ఫలిత మింతమంతా లభించుటేలేదు. లభిస్తే, చచ్చినవాడు పునర్జన్మమెత్తినట్లే లోకంసంతోషించును. ఆదినము చూడబోము.

ధనమందరికి నిండుగా యున్నప్పుడు కాని, ఉదారులగు ధనవంతులు పూనినప్పుడు కాని, స్త్రీసమాజములు స్థిరముగా యుంటాయి. సమానమే తలచనప్పుడిక, సమాజమెల్లాగ స్థిరపడ్డం ముందు? సమానభావం కదరాలికాని, రూపాయిచందాదారులు, దేవునిసన్నిధినన్ని, సమాజపెద్దల ముందున్న కూర్చోవాలి, తదితర స్వల్ప చందాదారు లవతలే యుండాలన్న ఉచ్ఛనీభావాలువదలి, మనోవర్తనం కలుగనంతసేపు, 'నూరు జుట్లిముడుతాయి కాని, మూడుకొప్పులిముడ" వన్న నిందితాపవాదం స్త్రీసంఘాలకు వదలదు. అవి వదలేస్తేకాని స్థిరసమాజాలు లభించవు.

అన్నిబాహ్యవిషయాలేచూస్తే జన్మలుతరించే భక్తివిషయాలకు వెళ్లవద్దా. శాశ్వతైశ్వర్యమే భక్తిగాన, అట్టిభక్తి ప్రార్థనరచన లవశ్యంయుండితీరాలి.

ఉపయోగించే వస్తువులపుట్టుపూర్వోత్తరాలు తెలిసికోవాలంటే గొడుగులవ్యాసం లాంటివికావాలి. ఇట్టి రచనానిర్మాణ మభివృద్ధి కావాలంటే స్త్రీలుపత్రికా సంపాదకులుగా యుండితీరాలి.

పత్రికలు స్థాపించి నడిపితీరాలి, విమర్శించి జ్ఞాన బీజాలు మొలకలెత్తించాలి.

త్రివర్ణచిత్ర రచనాప్రావీణ్యం బాగుంది. మొత్తం మీద మాదసరా 'గృహలక్ష్మి' ఈసారి ఆదర్శచెలిగా పరిణమించింది. అందరి ఆమోదంపొందింది. నూతన శక్తిప్రోక్కింది. తోడివారికిచెప్పి చూపించింది. ఇట్టిక్రొత్త దారులింకా చూపించి మాచెలి మాకొకదారి చూపాలని కోరుతూ ఎవరిళ్లకువారు పోయాము.

విద్యావిధాన మార్పులు జరగాలి. ఆచారసూత్రాలుమారాలి. ప్రబోధంజరగాలి. కాని, దసరా పండుగకు దసరాకథలు, సంకురాత్రికి గొబ్బిళ్లు, ముగ్గుల్ని, పిండివంటల్ని అల్లుళ్లని, క్రొత్తబట్టల్ని బొమ్మలకొలువుల్ని పట్టుకొని, చర్వితచర్వణంచేస్తూ వ్రాస్తూంటే, సంఘవైరులు గంగవెర్రుల క్రిందదిగుతాయి కాని పిచ్చలుకుదరవు. ఘాటుమందులకు కాని రోగనిర్మూలంకాదు.

ఒకే ఆచారాలని పట్టుకుతే ప్రాకులాడి అనుసరించే, సాంఘిక వైరిరోగం నివారణ కావాలంటే, రామబాణాలసంటి, రచనాపోటులతో కాని పురాణరోగాలు కుదరవు. గాన, నూతనరచనలు, విమర్శక వ్యాసాలు అవసరమని, మా గృహలక్ష్మికి మాసలహాగాచెప్పుచుంటిమి.

౨

## శ్రీమతి అడపా సుగుణమణిగారు

"గృహలక్ష్మి" బహుధాన్యనామ సంవత్సర దసరా సంచికను చదివెడి భాగ్యము లభించినది. ప్రకటనలొనర్చి, వ్యయప్రయాసములకు లోనై, విదుషీమణుల యమూల్యవ్యాసరచనలను సేకరించి సంచికను కైసేతతో వెలువరించిన సంపాదకులెంతయు వందనీయులు. ఈసంచిక ఆంధ్రభాషాలలామకొక యమూల్యభూషణమని చెప్పుట స్తుతివాక్యము కానేరదు.

ఈసంచికలో ప్రథమవ్యాసము సంపాదకీయములు తప్ప తదితరవ్యాసములన్నియు స్త్రీలచేతనే వ్రాయబడినవి. ఈసంచిక ప్రథమవ్యాసము దసరా అంతరార్థమును మనస్సు నొప్పించని హాస్యపుధోరణిలో చురుకుగా బోధపరిచినది.

ఈసంచికలో ఆరు కథలున్నవి. శతాబ్దములు దొర్లినా, ఆశయములు అడుగంటినా స్త్రీలు గుడ్డిగా పూర్వాచారము లనుకరిస్తున్నారని, శుభ కార్యములకు రవికలగుడ్డలను తీసుకొనిపోవుట యీతరగతికే చేరునని, అన్నింటికిని పురుషులపైన ఆధారపడిన స్త్రీలు యీ వాడుకను మొదలంట నశింపచేయు టావశ్యకమని, తమ యిండ్లలో జరిగే కార్యములలో దీని నాచరణలోనికి తెచ్చుట సమంజసమని, యుక్తియుక్తముగా "విందుముచ్చట" తెలియజేసినది.

నవమాసములు వ్యక్త్యస్తము లేక మోసి కని పెంచినను దేశ కాల పరిస్థితులబట్టి స్త్రీపురుష శిశువులను మాతృదేవి పక్షపాతదృష్టితో చూడ నవకాశము కలుగుచున్నదని ఆ స్త్రీశిశువు లీ పక్షపాతము గ్రహించి అభము శుభము తెలియని తమ చిరుతహృదయములను బాధించుకొని కృంగి, కృశించి అకాలమృత్యువాతబడుచున్నారని కరుణరసపూరితముగ "నాటికల" వాక్రుచ్చినది.

ధనవ్యయమునకు వెనుదీసినది పురుషులు, దర్జాలోపములకు భయపడినది స్త్రీలు, పెట్టుబడి చేసినది అల్లుండ్రు, పర్యవసానముగ లోటుపాటులు కలిగిన మనస్సు చిన్నబుచ్చుకున్నది కూతుండ్రని ఆయా సందర్భములను అతిశయోక్తిలేక పూసగ్రుచ్చినట్లు వక్కాణించినది "మావద్దనేగా వాళ్లమురిపాలు." పండగకి అల్లుండ్రను పిలువనంపుట దండగ యని హాస్యరసపూరితముగ "పండగకబుర్లు" తెలియజేసినది.

ప్రియులు ప్రేమించవలసినది అందచందములు కావు, అంగసౌష్టవములు కావు, పవిత్రమైన హృదయమనని ఉద్ఘోషించినది "వెన్నెల్లో."

కార్మిక స్త్రీలు కష్టములతో, శీలమును కాచుకొనుటకై పడిన పాట్లను కండ్లకు కట్టునట్లుగా వర్ణించినది "లక్ష్మి."

"యశోవతి" చరిత్రాత్మకమైనది చక్కని రూపు దాల్చినది.

"స్త్రీలు పత్రికాసంపాదకులుగా ఉంటే", "జీవితవికాసమునకు విద్య", "అభ్యుదయానికి అవసరమైన రచనావిధానము", "స్త్రీసమాజములు స్థిరముగా ఉండాలంటే", "భారత స్త్రీల ఉద్యమము—భావపరిణామము", మున్నగు రసవత్తరములగు వ్యాసములు స్త్రీల పురోభివృద్ధికై సూచన లొసంగినవి.

ఇందు "స్త్రీలు పత్రికాసంపాదకులుగా ఉంటే" అన్న వ్యాసములోనున్న విషయములను నేను కాదనను. కాని 32 సంవత్సరముల నుండి వ్యయప్రయాసలకోర్చి జ్ఞానప్రబోధమే ఆశయముగా పెట్టుకొని శ్రీమతి బాలాంత్రపు శేషమ్మగారి సంపాదకత్వమున స్త్రీలకొరకై నడుపబడుచున్న "హిందూసుందరి" పత్రిక స్వర్ణ సంక్రాంతిసంచికలో "అనేక పర్యాయములు స్త్రీలోకమున కంజలించి

వ్యాసములనీయ ప్రార్థించినను ఏలాగో ఆంధ్రసోదరీమణులు మా పత్రికయందు 'శీతకన్ను' చూపుట విచారణీయ"మని ప్రకటించినది. సోదరి లలితాదేవిగారు దీనినికూడ గమనించగలందులకు మనవి.

"విదేశీవత్తి వీడితే" తెలియజేసిన విషయములను పాశ్చాత్య వస్తువ్యామోహముగల ప్రతిగృహిణియు చదివి ఆచరింపవలసియున్నవి.

"వంచన! మాయ!! మోసము!!!" నివేదించిన రహస్యములను హరనాథబాబా భక్తురాంధ్రమని గుడ్డిగా ఒకరు పోయినదారిని ఇంకొకరు పోవు సోదరీమణు లందరు గమనించవలసియున్నది.

"హిందూమహమ్మదీయ సఖ్యత" విశాలదృష్టి కలిగియున్నది. దీనిని చదవగలిగినచో జిన్నాగారు ఇంకెన్ని వరకులు కోరదరో ఊహింపవలసియున్నది.

"పతివ్రతార్థం పతితమైంది," "ఆచారములు", "గోడుగుల పుట్టుపూర్వోత్తరాలు", "గానము", "గృహము-గృహలక్ష్మి" చక్కని సాదృశ్యములతో విషయములను నిర్ణయించినవి.

భావగీతములు "మా వదిన", "దారాభ్యగ్య సంఘం" హాస్యకరుణరసపూరితముగ నూతనత్వమును ప్రసాదించినవి. "ప్రాంజలి" యొక్క అమూల్యభావనము.

"గృహలక్ష్మి!" సాభిప్రాయము. "కాత్యాయనీ!" సామ్యము చక్కనిది. "పూజ" వ్యాఖ్యానము నిరుపమానము. "నాగరాణి" పలుకులు తియ్యనివి. "స్మారకచిహ్నము" సరళసరళి. సోదరి అచ్చమాంబగారు "గృహలక్ష్మి! రమ్ము మాయింటికి" అని చిరుతసోదరి గృహలక్ష్మిని తమ ఇంటికాహ్వానించి మార్గదర్శకులైనారు. ఇంకను పెక్కు సోదరీమణులు "గృహలక్ష్మి"ని తమతమ యిండ్లకు ఆహ్వానించవలసియున్నది.

ఈసంచికలో చాలవరకు రచయితల ఛాయాచిత్రములు చేర్చబడినవి. ఇది "గృహలక్ష్మి" కొక నూత్నశోభ. త్రివర్ణచిత్రము లెవరు చిత్రించినో తెలియదు. చిత్రకారుల పేరులు ప్రకటించిన బాగుండునేమో. త్రివర్ణచిత్రములలో 'కళాతన్మయత' జీవకళ ఉట్టిపడుచున్నది. 'అదృష్టశాలి' చక్కని దృశ్యము. ఇతర ఛాయాచిత్రములలో స్త్రీల పారిశ్రామిక లలితకళాకౌశలాల చిత్రముల సంఖ్య హెచ్చు.

# శ్రీమతి సుబ్బరాయనుగారి బిల్లు

*

## 'ఇది యెట్లు పరిణమించునో'

శ్రీమతి కొరప్రోలు వెంకటరంగమ్మగారు

ధర్మబద్ధమైన మన భారత దేశంలో మూడువంతుల వరకు స్త్రీలయొక్క మనో నిగ్రహమే, సత్యధర్మములను నిలుపుచున్న దని చెప్పక తప్పదు.

సాధారణముగా జనులలో నూతన ప్రియత్వము యెక్కువ. యెవరైనా ఒక క్రొత్తమాదిరి వస్తువునుగాని, క్రొత్త పాష నుగా అలంకరించుకొనుటగాని చూచిరేని, వెంటనే దాని ననుకరించుట అలవాటుగా వచ్చుచున్నది. ఇదివరకు మన దేశంలోకి, నాటక కంపెనీలు వచ్చినప్పుడు, పూనా స్త్రీల మాదిరిగా జడచుట్టు బట్టకట్టు మొదలైనవి ధరించిన స్త్రీపాత్రలనుచూచి, మన స్త్రీ లంతా ఆ విధమైన అలంకారములనే చేసు కొనేవారు. రానురాను ప్రస్తుతము సినీమా లోని స్త్రీల అలంకారములను చూచుట కలవారైన తర్వాత శరీరమంతటను వస్త్ర ముతో కప్పుకొనుటే మనవారికి అనాగరి కతమైనది. కావున, ప్రస్తుత మందుగల దేశాందోళనకు సాయము స్త్రీ పురుషుల ప్రేమలతకు గొడవలివంటి బిల్లు అమలు నకువస్తే మరియే సాధనములు అవసరము లేకుండానే, దేశము భ్రష్టుకాగలదు. కొం దరికి 'ఇట్టి నిబంధనలవల్లనే దేశాభ్యుదయము' అని తోచవచ్చును. కాని, ప్రతివారికిని అనుకూలించు విషయము కాదని చెప్పవలసి యున్నది. ఏ స్త్రీ పురుషులకు జన్మాంతము నందైనను విడువని ప్రేమపాశముండునో ఆ స్త్రీ పురుషుల పవిత్రాత్మశక్తులే దేశమును గాని, లోకమునుగాని ఉద్ధరింపగలవు. ప్రేమయే పరమేశ్వరుడు. ప్రేమలేనితావు నిర్జీవము. కావున నిట్టి స్వచ్ఛ ప్రేమా మృతము నింకింపజేయకుండా నట్టి సనరణ లలో యీా బిల్లు ప్యాసు కాజాలనియడల యీా బిల్లుయొక్క లాభ మెంతమాత్రము లేకపోవుటయేగాక, మరి కష్టములకుగూడ కారణమగునని నా అభిప్రాయము.

# బహుపత్నీత్వ నిరోధచట్ట మవసరముగాని, విడాకుల చట్ట మవసరమా?

శ్రీమతి నెమిలి చంద్రమతిగారు

శారదాబిల్లు అమలులోనికివచ్చిన వెనుక అతిబాల్య వివాహములు రూపణంగుచున్నవి. బాలికకు యుక్తవయసు వచ్చిన వెనుక వారి యనుమతిపైననే తలిదండ్రులు వివాహములు చేయుచున్నారు. అట్లు భార్యాభర్తలు ఒకరినొకరు తెలుసుకొని ఒకరినొకరు ప్రేమించి వారల యిష్టప్రకారము 'పెండ్లి'అను పరమపవిత్ర ప్రేమబంధనము గావించుకొని, యావజ్జీవము ఒకరినొకరు నెడబాయక కష్టమునందైనను సుఖమునందైనను సమముగా అనుభవించవలసిన వారికి విడాకులచట్టమవసరమా? తలిదండ్రులచే తమ చిన్నతనమందిష్టము లేకున్నను ఒకనికిచ్చి వివాహము గావించినను వారు కాలక్రమేణా యాతనినే ప్రేమించి యెంతటి దుర్మార్గుడైనను భర్తపెట్టు భాధల కన్నిటికిని, సహించి నోరు మూసుకొని యుండు ఉత్తమురాండ్రుండు యీ భారతదేశపు స్త్రీలు, యుక్తవయసు వచ్చినవెనుక ఒకరి నొకరు ప్రేమించి పెండ్లి చేసుకొని, విడాకులు పొందవలసిన అవసరముండదనియే నమ్మెదను. పరమ పవిత్రమైన ప్రేమకు విలువలేదా? పెండ్లినాడు పొంగి పొరలివచ్చు ప్రేమయంతయు వట్టి బూటకమా?

భార్యా భర్తల ప్రేమ పరమపవిత్రమైనది, నిశ్చలమయినది, నిర్మల మయినది కదా. అటువంటి ప్రేమను తృణీకరించి, వేరొక వివాహము చేసుకొనిన, యాప్రేమ మాత్రము స్థిరముగా నిలుచునని యేమి నమ్మకము?

అనాదినుండి వచ్చుచున్న, హిందూ స్త్రీల పాతివ్రత్యమునకు, భంగము వాటిల్లును. పాశ్చాత్య స్త్రీలకును, హిందూ స్త్రీలకును గల బేధమేమి? భారత నారీమణులు దేనివల్ల గౌరవింపబడుచున్నారో నది శూన్యమగును. పాతివ్రత్యము కేవలము బానిసత్వమని కొందరనుకొనుచున్నారు. విద్యా వివేక సంపన్నురాలై సకల విషయములందును, భర్తకు తోడునీడనై మెలంగుట బానిసత్వమా? ఇంకను, మునుపటివలె గాక, యిప్పటి స్త్రీలు అన్ని విద్యలు నేర్చి, యన్నింటను బాధ్యత వహించుచున్నారు.

అనారోగ్యమని, భార్యా భర్తలు, యొకరి నొకరు విడిచినచో వారల గతేమి కాను? ధనవంతురాలయినను, రోగగ్రస్థు

రాలయిన భార్యకు భర్తప్రేమ తప్ప యితర మేమి కావలెను? ధనమెందుకు? సొమ్ము లెందుకు? భర్త రోగగ్రస్థుడైన భార్య యాదరణ, భార్య రోగగ్రస్థయైన భర్త యాదరణ తప్ప, వేరేదియు నక్కరలేదు. విధివశమున వీరికి బిడ్డలున్నచో వారేగతి పట్టుదురో? ఇటువంటి సమయమందు విడ నాడి పోయినచో సంతకంటె క్రూరత్వముం డదు నరజన్మ మెత్తినవారికి. ఇక దరిద్రుల మాట చెప్ప నక్కరలేదు. వారల గతి అధోగతియే.

అన్నాళ్లనుండి ప్రేమించుచున్న ప్రేమ నాటితో విడిపోవునా? భార్యా భర్తల బంధనము మృత్యుదేవతకు కూడ ఖండిం చుట కశక్యమగుచున్నది. మరణించినను ప్రేమ బంధన తెగకున్నది. అట్టి వివాహ బంధనమింత సులభముగా తెగిపోవునెడల వివాహమే విలువలేనిదగును.

స్త్రీలిట్లు నిష్కళంకమైన ప్రేమతో తమ భర్తను నమ్మి ప్రవర్తించుచుండిన, నుత్తము డైన భర్త తిరిగి ప్రేమించి ప్రతిఫల మివ్వక పోడు.

భర్త దుర్మార్గుడైనచో వారలకు శిక్ష విధించు చట్టమేర్పడిన బాగుండును. దుర్మార్గు రాలైన భార్యకుగాని, దుర్మార్గుడైన భర్తకు గాని శిక్ష విధించుట న్యాయము.

పెనిమిటి త్రాగుబోతైనను, పరస్త్రీ లోలుడైనను, భార్యను సదా పీడించువాడై నను, మొదటి భార్య జీవించియుండ మరొక భార్యను వివాహమాడినను, యిట్టి నేరము లకు శిక్ష విధింపబడవలెను.

'బహుపత్నీ నిరోధ చట్టము'ను గూర్చి బాగుగా యోచించి, అందు విడాకులను పొందు కట్టు దిట్టములను కొంత సవరణల చేసినగాని, స్త్రీలకు లాభకారికాదు.

దేశమునగల, దురాచారము, దుష్ప్రవర్తన, మొదలగునవి రూపుమాపు చట్టముల నేర్పరచిన, హిందుదేశము అత్యున్నత స్థితికి వచ్చుననుటకు సంశయముం డదు.

# 3

# సవరణలు కావలెనా?

'ఉభయభాషాప్రవీణ' ఎం. వేదవల్లి తాయారమ్మగారు

ఏదైనా క్రొత్తవిషయముల్లోకి రావాలంటే యే దేశములోనైనాసరే చాలా ఆందోళన బయలుదేరుతుంది. అదేదో ప్రళయమని నాన్-కో-ఆపరేషన్ బయలుదేరిన ఆరంభంలో గాంధీగారిని తిట్టనివారంటూ లేరు. కొంతకాలమయ్యేసరికి దానిలోగల మంచి చెడ్డలు గ్రహించి ఆందోళనచేసినవారంతా కాంగ్రెసు పార్టీలో కలిసిపోయారు. వితంతు వివాహాలారంభమైనప్పుడుకూడా అంతే. రాజమండ్రివీధులలో వీరేశలింగం పంతులుగారు వెళుతూంటే శిలావర్షం కురిసేదట. అంతపనికిరాని వితంతువివాహా లిప్పుడు కాలంగడచిన కొద్దీ కన్యావివాహాలతోబాటు జరిగిపోతున్న యి. సంస్కారమనేది ఔషధసేవవంటిది. మొదట్లో కష్టంగా ఉన్నా అలవాటునుబట్టి సంఘానికి ఆరోగ్యమైన మేలు కలిగిస్తుందంటే అతిశయోక్తిగాదు.

అటువంటిదే యీ ప్రస్తుతపుబిల్లుకూడాను. కాని సీత, సావిత్రి మొదలైన పతివ్రతామతల్లుల కాదినిలయమైన మన భారతభూమిలో స్త్రీ తనభర్తతో విడాకులు పుచ్చుకోవడమనే సంగతి వినగానే గుండె బాదుకొంటారు. మన పూర్వచరిత్ర చూస్తే భర్త కుష్ఠవ్యాధిపీడితుడైనా వాని నెత్తినిడుకొని పూజించిన మహాతల్లులున్నారు. వారి దాంపత్యగ్రంథిజీవితాంతములో నంతమొందవలెనేగాని యెట్టి యవాంతరములు వచ్చినా వీడదు. అందుకనే పెండ్లిబేరములపుడు "పెండ్లి అంటే నూరేండ్లపంట" అను లోకోక్తి వాడుకైంది. ఆలాటి నూరేండ్లపంటను అయిదేండ్ల ప్రవాసమో, వివాసమో, వైముఖ్యమో, వైరాగ్యమో, వ్యభిచారమో, వ్యాధియో వచ్చిన మాత్రాన విడిపోవచ్చునని చెప్ప టెంత యాలోచనా దూరమో సహృదయు లెరుంగుదురుగాక! వ్యాధి బాధితురాలగు భార్య యీ అయిదేండ్లపరిమితి దాటినవెనుక ఆరోగ్యవతియైన నామె గతి యేమి? పునర్వివాహమాడవలసినదేనా? బిడ్డలున్నచో వారేమి కావలెను? తల్లి బ్రతికియుండగనే బిడ్డలను సవతితల్లి కప్పగింతురా? (తల్లికి తన బిడ్డలపై నధికారము హిందూ'లా'లో లేనందున) ఈ పైవిషయము లన్నియు బుద్ధిమంతు లూహింపదగినవే.

మరియు నీ బిల్లునందలి (c)లో "ఏయొకరిలోనైనను జారత్వము నిరూపింపబడినట్లైన" అని గలదు. భర్త జారత్వమును సహింపలేని భార్యగాని, భార్య జారత్వమును సహింపలేని భర్తగాని యొకరినొకరు విడిచిపెట్టి తాముచేయు మహాకార్యమేమి? పునర్వివాహమాడగోరిన నదిమాత్రము జారత్వమనబడదా? వివాహముగాన నది మంచిదేనని యందురేమో; స్త్రీ యట్లుచేసిన నామెను శీలవతియని యెవరైన చెప్పగలరా? ఇట్టి యల్పకారణములను పురస్కరించుకొని దేశోపకారకమగు బిల్లునందు మార్పులను గోరుట చాలా విచారము. బహుభార్యానిరోధ శాసనమను పేరుతోనున్న యీబిల్లు బహుపతీత్వమునకు దారితీయుచున్నది. ఏదేశ మన్నిదేశములకంటె నీతి మతవర్తనములం దగ్రతాంబూలమందినదో, యేదేశమున పాతివ్రత్యము పాతుకొనియున్నదో యట్టి భరతభూమికి కళంక మాపాదింపజూచు టెంతయు శోచనీయము. పాశ్చాత్యదేశములందు నూటికి డెబ్బది వివాహములు రద్దగుటకు కారణము వివాహవిచ్ఛేద చట్టమేగదా! వారి వివాహాలు కంట్రాక్టుల వంటివి. కాన మన మీవిషయమున వారి ననుకరింప జూచుట చాలా నింద్యము.

నేటికాలమున పురుషుల బహుపత్నీత్వమువలన బాధలనందు పడతు లనేకులున్నారు. ఇంటికొకరున్నారన్నా పాపములేదు. పెండ్లిలోనిచ్చిన కట్నం చాలదనో, బిడ్డలు లేరనో, జబ్బుమనిషనో వ్యభిచరించిందనో వంకలుపెట్టి రత్నముల్లాంటి స్త్రీరత్నాలను రాళ్లపాలుచేసి దివ్యమణి కారవైచి గవ్వగైకొన్నట్లు మరొకదాన్ని చేపడుతున్నారు. దానివల్ల సంఘానికి చాలా అనర్థాలు కలుగుతున్నాయి. మొదటి ఆమె మనువర్తికి దావావేస్తే ముప్పతిప్పలు పెట్టికొన్నాళ్లా సొమ్మిచ్చుకొని అటుపైని కర్చు భరింపలేక ఆమెను రెండవ ఆమెలో జతచేసి యిద్దరిమధ్యా ఇరికి నరకమనుభవించేవారున్నారు. ఇందులో యింకో చిత్రం. భార్య యెంత యిల్లాలైనాసరే "నాకు మనువర్తి కావాలి గాని భర్తపెట్టే కష్టాలు పడలేను" అనడానికి వీల్లేదు. అతడు కోర్టువారిని కోరితే యేలాటి కర్తికోతకైనా సహించి భార్య గుడికిపోయే మేకలాగు భర్తయింటి కేగవలసిందే. అట్టిపరిస్థితుల్లో యీబిల్లు అవసరమేగాని పురుషునకు భార్యయుండగా రెండవభార్యను తెచ్చుకొనుట కవకాశములేకుండే పైనిచెప్పిన దౌర్జన్య మెంతమాత్రమును సాగదు. భార్యయెడ కొన్నిలోపాలున్నా శాసననిర్బంధముచే వాటిని సవరించుకొని యెట్లో కాలంగడుపుకుంటారు. కాన నీబిల్లు స్త్రీలకువలెనే పురుషులకుగూడా భార్య

యుండగా రెండవపెండ్లి చేసికొనే యధికారము లేకుండునట్లుండిన చాలును. భర్తగాని భార్యగాని సాంసారికజీవితము ౯ దపడాని కెంతమాత్రము పనికి రాని పిచ్చివారుగానున్నపు డొకరినొకరు విడిపోవచ్చునను సవరణకూడ నుండనక్కరలేదు. ఆ మతిభ్రమణము సర్దుకొని మానవకోటిలో మనగల్గితే అట్టివారికి బాధాకరము గాగలదు. బిల్లునందు జూపిన సవరణలు లేక యొక్క బిల్లుమాత్రమేయుంటితే వివాహబంధ మిప్పటికంటె మరింత దృఢపడగలదు.

బిల్లునందు సూచించిన సవరణలో నే యొక్క కారణము గల్గినను రెండవపెండ్లి కవకాశమిచ్చినచో నింత శ్రమపడి ప్రవేశపెట్టిన యీ బిల్లు ప్రయోజనము లేనిదగుటయే గాక పైపెచ్చు స్త్రీలకు గల పవిత్రతను బోగొట్టి పునర్వివాహేచ్ఛను రేకెత్తించుననుటకు సందియములేదు. ఇదివర కిట్టి కోర్కెలు మన స్త్రీలకు కల్గెనా యని కొందఱు ప్రశ్నింపవచ్చు, కాని యేదైన కొంచెము నవకాశముంటే దాన్ని వ్యర్థపరచుకొనే వా రుంటారా? ప్రజలు పాశ్చాత్య నాగరికతా వ్యామోహంలో మునిగిపోయిన యీ కాలంలో "కుక్కకాటుకి చెప్పుదెబ్బ" అన్నట్లుండవలెనని దయావిహీనులైన భర్తమీద కోపంచేనైనా రెండవపెండ్లికి సాహసించే నారీమణు లుండకపోరని నా మనవి. సాటిసోదరి యిలా వ్రాసినదని సోదరీమణులు నాపై కినియకుందురు గాక! అది ప్రకృతిసిద్ధమైన మానవస్వభావము.

ఇంతే కాక బాల్యవివాహములు చాలవర కంతరించినవి. ప్రౌఢావివాహాలు ప్రబలినవి. నిరాటంకముగా యువతీయువకు లొకరి నొకరర్థం చేసికొన్న తర్వాతనే కొన్నివివాహా లవుతున్నయి. ఇక ముందింకా జరగగలవు; అట్టి సందర్భాల్లో నీ బిల్లులో గల సవరణల కెక్కువ చిక్కదని నా యూహ. ఒక కార్యము చేసేటప్పుడు "కీడెంచి మేలెంచవలె" నన్నట్లుగా రాబోవు నవర్థాలనే ముందుగా మనము చర్చించుట లెస్స, చేతులు కాలిన వెనుక నాకులు పట్టుకొనుటకంటె అసలు చేతులే కాల్చుకొకుండడం మంచిదని అందఱికీ తెలిసిందే. కాన నీ బిల్లు శాసనసభలో ప్రవేశపెట్టక ముందే దీని భావిపరిణామమును బాగుగా యోచించి యెట్టి సవరణచేసిన భారతమహిళామణుల పవిత్రతకు భంగము వాటిల్లదో కాపురములకు కీడుమూడదో యట్లొనర్చిన దేశమునకు సంఘమునకు మహోపకారము గావించినవారవుతారు.

## వ్యాసకర్తలకు ముఖ్యమైన గమనిక

కొంతమంది రచయితలు మాకు వ్యాసములు పంపి, మేము వాటిని ప్రకటింతుమని తెలిపిన తరువాతకూడా అదే వ్యాసములను ఇతర పత్రికలకు పంపుతూ ఉన్నారు. ఇది చాలా విచారణీయము. వేరువేరు పత్రికలకు రచయితలు వేరువేరు వ్యాసములను పంపితే మాకు సంతోషమే కాని ఒక పత్రికకు ఒకవ్యాసము పంపి, అది ప్రకటించుటకు అంగీకరింపబడిన తరువాత, ఆ పత్రికకు తెలియకనే ఇతర పత్రికల కదే వ్యాసమును - కొంచము మార్చో ఉన్నదున్నట్టుగానో-పంపడము మా అభిప్రాయాలకు వ్యతిరేకము. అటువంటి ఉద్దేశముతో మాకే వ్యాసమూ పంపవలదని రచయితలకు మనవిచేస్తున్నాము.

# పుష్పచయము

## అందాన్ని చెరిపితే నేరం

చారిత్రికంగా చూస్తే మనఅలంకారరచనలో పత్రరచనే ఆద్యసృష్టిగా తోస్తుంది. పచ్చబొట్లు రకరకాల బంగారూరత్నాలూ సొమ్ములూ యివన్నీ సౌలభ్యంకోసరం శాశ్వతంకొరకు ఏర్పడ్డ మార్పులుగా వుండొచ్చు. పత్రరచన తరువాత పారాణి చాలా ప్రాముఖ్యం గడించింది. కాని ఈ మధ్యను చిన్నచిన్న అలంకారరచనలు చాలాచాలా వున్నవి. అందు కొన్ని:—

నల్లని నిగనిగలాడే కాలాంజనంతో కనుబొమ్మలు సోగలు తేరేటట్లు దిద్దుకోడం ఒకటి. ఇది భ్రూవిలాసాభిజ్ఞతను తెల్పేదిగా వుంది. పండ్లకు పెదవులకు రంగులు వేసుకోవడం కాళ్లా, వేళ్లా, గోళ్లకు గోరింట పెట్టుకోవడం, పళ్లకు నిగనిగ వచ్చేటట్టు వరిగింజలో పళ్ళుతోమడం, పసుపునీళ్లతో జలకం, తెల్లావాలు చూర్ణించి ఫేస్ పౌడరుగా ఉపయోగించడం రెండోది. ఇది దశనవసనాంగ రాగమనే లలితకళకు నిదర్శనం. చిత్ర విచిత్రరీతుల నొంగమున బొట్టుదిద్దుకోవడం మూడోది. యిదే విశేషకచ్ఛేద్యమనే కళ. కళ్లకు కలాంజనంతో కాటుక పెట్టుకోవడం, పెదవులకు తడిఆరని సిక్థకంతో పవడప్రభగి వచ్చేట్టు అద్దుకోవడం నాల్గోపని. యింకా కర్ణపత్రరచనలూ, పాముకుబుసంలాంటి సోగజడలు అల్లుకోవడం చిత్రవిచిత్రాకృతుల పూవుచెత్తులు ధరించడం స్తనాలు మూగారువళులు కస్తూరితో దిద్దడం హారాదులు అనేక తరహాలవి ధరించడం యిత్యాదులు అనేకం వున్నవి.

పురుషులూ స్త్రీలూకూడా నాటివారు అలంకరించుకోకుండా బయటకు రావడంకానీ, ఏదైన బహిరంగపు వుత్సవాలల్లో పాల్గొనడంకానీ చాలా చిన్నతనంగా అనాగరకంగా నాటివారు యెంచేవారు.

ఒక బస్తీలోని అందగత్తె పల్లెటూరి పడుచును అందచందం లేనిదని ఆక్షేపిస్తే ఆమె ఏమన్నదో విన్నారా?

శ్లో॥ గామారుహమ్మి గామేవసామి ణగరట్ఠిదిం ణజాణామి ణాగరిగాణాం పడిణో హరేమి జాహోమి సాహోమి.

నేను పల్లెల్లోనే పుట్టాను. పల్లెల్లోనే పెరిగాను. బస్తీల కాపరం యెరగను నిజమే. అయినా బస్తీలోని అందగత్తెలం అనుకునేవారి భర్తల సందరినీ నావెనకాలే తిరిగేట్టు చేసికోగలను. ఇక నేను యెవతెనైతే దాన్నే అవుతాను” అంది ఆమె. అనగా ఆమె యెంత సహజసౌందర్యం ఆకర్షణశక్తి కలదో యెంత అభిమానవతో ఆలోచించి చూడండి.

ఆకాలంలో పారాణి పెట్టుకోవడం ఒక ప్రళయమంతపని. అంటే యెంతో నేపు తంటాలు పడినా తెమిలేదే కాదు. మకరికారచన పారాణి నాటి స్త్రీలకు పురుషులే యెంతో ఓపిగ్గా చేసేవారట. ఇందుకు బహుశా వారికి శ్రమకుతగ్గ ప్రతిఫలం ముట్టేదేమో?

ఏదయినా కారణాంతరాలవల్ల సౌందర్యం చెడిపోతే దాన్ని మళ్లా నిలుపుకోటానికి చాలాచాలా యత్నాలు ఆనాటివారు చేసేవారు. ఎవరయినా ద్రోహబుద్ధితో యితరుల అందాన్ని చెడగొట్టినా లేక చెడగొట్టే ప్రయత్నం చేసినా ఆనాడు న్యాయస్థానంలో అది రుజువైతే అట్టివారికి ఉత్తమసాహసదండం శిక్షగా విధించవలెనన్నారు అర్థశాస్త్రజ్ఞులు! చూడండి నాటివారి సౌందర్యరక్షణదీక్ష యెంతదో. సౌందర్యాన్ని పునః స్థాపించుకొనే యత్నాన్నే మనవారు సుభగంకరణం అనేవారు. ఈక్రింది విషయాలు అందులోనుండే చెబుతున్నాను. తగరకం (గ్రంథితగరం) చెంగల్వకోష్ఠు తాడిశపత్రీ చూర్ణించి దాంతో అనులేపనం చేసికోవడమున్నా లేదా ఆచూర్ణంతో వొత్తులుచేసి వెల్గించి ఆమసిని కాటుకచేసి పెట్టుకోవడమున్నా పునర్నవా, సహదేవఆకు శారిబ గోరింట కలువపూలు వీటి ఆకులు వేసి కాచిన తైలంతో అభ్యంజనం చేసికోవడమున్నా లేక వీటి పూవులతో మాలికలుచేసి ధరించడమూ యిత్యాదులన్ని శరీరపుఅందాన్ని నిలుపుకోవడంలో ఆనాటివారు ఉపయోగించేవారు. వైద్యశాస్త్రంకూడా ఈవిషయాలను యెంతో విస్తరించి చెబుతుంది.

ఎన్నని చెప్పేదండీ! ఆనాడు మనవారు సహజమయినా, యీశ్వరదత్తమయినా యీఅందాన్ని పెంపొందింప చేసుకోడానికిగానీ, లేదా ఆఅందం కారణాంతరాలవల్ల చెడితే మరల దాన్ని చక్కచేసుకోవడానికిగాని యెంతెంతో శ్రమచేసేవారు. పరిశ్రమ చెయ్యడమే కాదు. సౌందర్యాన్ని నిలుపుకొన్నారుకూడా.

పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి—రేడియోలో.

* * * *

## వీణ విలువ

సమస్తవాద్యములలోను ఉత్తమమైనవి జంత్రవాద్యములు. జంత్రవాద్యములలో వీణరాణివంటిది. మానవుని దేహతత్త్వమునకును యీ వాద్యముయొక్క పలువిధములగు అంగములకును సంబంధము గలదు. మానవుని శరీరములోని వెన్నెముక ననుసరించియే యీ వీణయొక్క దండము యేర్పరుపబడినది. మన యోగశాస్త్రములో వెన్నెముకకు వీణాదండమని పేరిడబడుట లోకవిదితము. కాబట్టియే యీవాద్యమునకీ పేరు వచ్చియుండవచ్చును. దీనియందలి పీటకు మానవుని ముఖమును, శబ్దమొసంగు ప్రదేశమునను, జిహ్వామును, మేరువు నాభికిని సరిపోల్పదగును. నేడు నాటికో కోటికో తప్ప సర్వత్రా హార్మోనియముకే అభిమానించుచున్నారు. దీనిని ఆధారశ్రుతిగాకూడ ఉపయోగించుచున్నారు. అట్లు ఉపయోగించుటవలన చాలాలోపములు కలుగుచున్నవి. తంబురశ్రుతి ఉత్తమపద్ధతి హార్మోనియము శ్రుతి అధమపద్ధతి. సప్తమహాఋషులు సప్తతాళములు, సప్తస్వరములు, సప్తశ్రుతులు, మేళవింపబడిన సంగీతస్వరనినాదమే ఈ సప్తతీగలతో కూడిన వీణావాద్యముయొక్క ప్రతిభాప్రభావము. గాంధర్వులకు విద్యాప్రదాయిని యీ వీణయే. ఇందలి సంగీతానందమున కమరలోకప్రజాను లనుదినమును అమితానందముతో యెదురుచూచుచుందురు.

గుమ్మిడి ధనలక్ష్మీమనోహరకుమారి.

* * * *

'నీవు పెళ్లాడింది దేనికి?—'

చిన్నపుద్యోగి—"నేను వంటమనిషిని పెట్టుకొనుటకు తగినంతశక్తి లేనివాడిని గనుక."

ముసలిఫించనుదారు—"నేను పుద్యోగం చాలించుకొన్న తరువాత ఏమిచేయుటకు తోచదుగనుక."

ఆకతాయి—"నేను పెళ్లిచేసుకుంటే నాకు చాలామంచిదని నాస్నేహితుడు చెప్పినాడు. కాబట్టి."

వర్తకదేశసంచారి—"ఆపిల్ల తండ్రివుయిలు వ్రాస్తూ అల్లుడుకు కట్నంక్రింద నయిదువేల రూపాయ లివ్వమన్నాడు గనుక."

ముసలితొక్క—"నేను చస్తే యేడిచే వాళ్లుండరని నా పేరు మీదుగా నొక విధవన్నా యేడుస్తూ వుంటుందని."

లోభి—"నా పారిపోయిన నౌకరుకు బదులుగా చౌకగా వస్తుందని."

గడుసువాడు—"ఎందుకు చేసుకోగూడదో చెప్పలేదు కాబట్టి."

శ్రోత్రియుడు—"ఏదన్నా క్రతువులు చేసేటప్పుడు ప్రక్కను భార్యలేకుండా అగ్నిహోత్రుని ముందు కూర్చోకూడదు కాబట్టి."

తార్కికుడు—"భార్యఅర్ధాంగి అన్నారు కాబట్టి సగముశరీరముతో నుండుట కిష్టములేక."

కోటీశ్వరుడు—"నేనుక్రొత్తగా కట్టించిన అంతఃపురములో నుండుటకు స్త్రీలేదు గనుక."

నవోత్సవకుడు—"సంసారం లేకుండా కొంతకాలము గడిపినాను. సంసారముంటే యెట్లావుంటుందో చూద్దామని."

మూఢవిశ్వాసి—"నేనుపాతిక రూపాయలిచ్చి జాతకము వ్రాయించాను. అందులో నాకంటే నాభార్య ముందు చనిపోతుందన్నాడు. అతనిమాట నిజముగాకుండా వుంటుందా అని చేసుకున్నా."

మోహాంధుడు—"అదివచ్చింది—చూచింది— నన్నులోబరచుకున్నది."

అమాయకుడు—"తనను పెండ్లి చేసుకుంటేగాని వల్లగాదని కూర్చుంది గనుక."

తాతలనాటిపల్లెగబ్బిలాయి—"మామేనమామ కొడుకుస్నేహితుడి బావమరది కూతురట ఆపిల్లముత్తవ మాపరింటెండెంటుగారి కేదో కావాలట."

ఆడంగిలేకి—"నాచేత కొట్లుగాని తిట్లుగాని పడేవాళ్లెవరూలేరు కాబట్టి."

అనాధప్రేత—"తాను సంపాదించుకోని నాకు సంపాదించి పెట్టుతుందని."

—వీరపనేని జగన్మోహన సూర్యనారాయణగారు.

* * * *

## వివాహవిధానంలో విప్లవమే రావాలి!

ఇపుడు మనలో జరుగుతూవుండే వివాహవిధానముమీద దోషారోపణచేస్తే మనదేశీయులంతా ఆశ్చర్య పడతారు.

అయితే మనకుటుంబాల్లో మనమెలా జీవిస్తామో అది బైటతెలియకుండా దాస్తూవుంటారు. వివాహ విధానాన్ని సర్వజనసమ్మతమైన వంచకే కాపాడుతూవుంది. సంఘంలో వివాహవిధానములో ఉన్నన్ని అబద్ధాలు మరి దేన్లోనాలేవు. వివాహితులందరూ వీటిని భరిస్తున్నారంటే విచిత్రముగా ఉంటుంది. ఇది వేల మంది ఎఱుగుదురు. అయితే వాటిని సవరించడానికిగాని చక్కచేయడానికిగాని వారికి శక్తిలేదు, ధైర్యమూ లేదు.

కొత్తవ్యక్తితో ఒకేఇంట్లో నాలుగైదేళ్లు కాపురం చేయవలసివస్తే దాన్నిగురించి ఎంతో ఆలోచిస్తారు. జీవితకాలమంతా భాగస్వాములుగా జీవింపవలసివుండే పెళ్లివిషయంలో ఎవరికీ ఆ ఆలోచనే లేదు.

ఇలాఅంటే అంతా ఆశ్చర్యపడవచ్చు; అయితే అందులోని సత్యాన్ని అందరూ అంగీకరించ వలసిందే. వివాహానికి ముందాలోచించేవారు చాలాకొద్దిమంది. ఎందుకంటే పెళ్లిళ్లు పెద్దలేఏర్పాటుచేసి అందులోకి యువతీ యువకులను తోసివేస్తారు. కొంతమంది యువతీయువకులు పైమెరుగులకు మైమరచి పెళ్లిచేసుకుంటారు. దేన్లోనైనా, యువతీయువకులు గాని తలిదండ్రులుగాని జీవితాంతంవరకూ ఉండబోయే సాంసారిక జీవితాన్నిగురించి ఆలోచించరు.

పెళ్లిఏలాచేసినా అందులోకి మతము, పవిత్రత, నీతి, ప్రేమ, వాటంతటవే ప్రవహిస్తాయని అందరూ అనుకునేటట్టుంది. ఎవరికిగాని పెళ్లినికప్పివుండే వంచననే తెరను చీల్చగుండెలు లేవు. కిక్కురుమనకుండా లక్షల కొలది స్త్రీ పురుషులు దీనివల్లకలిగే కష్టాలను అనుభవిస్తారు; పైగాఅది వారిఅదృష్టమని దేవుడల్లా నియమించాడని అనుకుంటారు.

తాతల ముత్తాలంతా యీలాగే పెళ్లాడి సుఖపడిరిగదా, వారిసంతతివారమైన మనమెందుకు సుఖపడడం లేదు?అనే ప్రశ్న బాగా లేవుంది. వారు, ఆశయాల్లోను, అభిప్రాయాల్లోను, అభిరుచుల్లోను, ఎదుగు పొదుగులు లేకుండా ఒకటేగాడిలో నడిచారు.

ఇప్పుడు నాగరికత అభివృద్ధి చెందింది; ఆశయాలుమారినవి; అభిరుచులు క్రొత్తత్రోవ త్రొక్కినవి; అభిప్రాయాలు స్వతంత్రించినవి. అందుకే సంఘములో ఎంతనాగరికత చెందివుంటే వారివైవాహిక జీవితాల్లో అంతఅశాంతి అంతఅలజడి. నాగరికతవాసన లేకుండా వుండేవారిలో ఇప్పటికీ పూర్వపద్ధతే అయినా అశాంతి అలజడి లేవు.

మానవుని కార్యరంగంలో తప్పులుదొర్లితే సవరణకు మార్గముంది. వివాహము మానవాతీతమైంది; దాన్లోపొరపాటైనా వుందని అంగీకరించదు. మతము, సంఘము దానికిమానుషత్వం అసలేలేదంటాయి. అయినా అనాలోచితముగా యీ వివాహాంబుధిలో దూకుతూవుంటారు. తప్పించుకోవడం చాలాకష్టం.

కాబట్టిఒక విప్లవంరావాలి. కాని వివాహంఅసలే ఉండకూడదని నేననను.

సత్యమైనవివాహం ప్రేమ, పరస్పరావగాహన ఫలితంగావుండాలి; బలవంతము, ఉద్రేకము కారణాలు కాకూడదు.

విజయవంతంగా వుండేవివాహం ఏదంటే—అందులో భాగస్వాములు కాబొయ్యే ఇద్దరువ్యక్తులూ, యీ సంగతిపూర్తిగా తెలుసుకోవాలి: అవిసంపూర్ణ సహకారము—భౌతికమూ, మానసికమూ—ఒకరికొకరికి అతుక్కుపోయి పని చేయడము; ఇదిస్నేహాన్ని, సంతోషాన్ని ఇస్తుంది.

పెళ్లయింది కాబట్టి, పిల్లలున్నారు కాబట్టి, సంఘమువలన భయంకాబట్టి, తమ అదృష్టమంతే అనుకున్నారు కాబట్టి, భార్యాభర్తలుగా వుండడము స్త్రీ పురుషులకు వేయదగిన ఘోరశిక్ష.

మనవివాహ విధానాన్ని మనము సంస్కరించాలంటే ఒకటేదారి. యువతీ యువకులకెక్కువ స్వాతంత్ర్యం యివ్వాలి; వారికి బాల్యమునుండీ సౌఖ్యకరమైన జీవితమంటే ఏమో బోధపరుస్తూరావాలి. ఈస్వాతంత్ర్యాన్ని దుర్వినియోగంచేస్తే చేయవచ్చు. అయినా త్వరగానే సంఘం బాగుపడుతుంది, మానవజీవితంచాలా సౌఖ్యవంతమవుతుంది—సావిత్రీదేవి. O. I. W.

# గ్రంథ సమీక్ష

## వెంకటచలం కథలు.

రచయిత శ్రీ గుడిపాటి వెంకటచలంగారు. ప్రకటన కర్తలు నమ్మాళ్వార్స్, పోష్టుబాక్సు 251, మద్రాసు. వెల ప్రతి 6 అ.

ఇందులో "వివాహము" అనేకథ పుస్తకమంతా ఆక్రమించింది. చివర "శేషమ్మ" అనే స్కెచ్చి చేర్చబడింది. చలం కథారచనలో సిద్ధహస్తుడైనా "వివాహము" కథలో అతని గొప్పతనాలేటివీ కనిపించవు. పైగా అవసరంగా ప్రిపరేషనేమీ లేకుండా వ్రాసినట్టు కనబడుతుంది.

అప్పటికి "ఆనందమూ, సౌందర్యమూ మానేసి, ముప్పైయేళ్లై"న "శేషమ్మ"ను గూర్చి, ఆవిడ ప్రకృతినిగూర్చి అంత అద్భుతంగా వ్రాయడానికి చలానికే సాధ్యమయింది. ఆవిణ్ణిగురించి చదివినప్పుడు పాఠకులు ఆమె ప్రతియింట్లోనా వుండేదే అని ఆశ్చర్యపడకుండా వుండరు.

* * *

## శిరోమణి కథలు.

దీని రచయితలు—శ్రీనివాస శిరోమణిగారు—కూడా ఓగొప్ప కథకులే. ఇదీ నమ్మాళ్వార్సే ప్రకటించారు. వెల ప్రతి 6 అ.

ఇందులో "యోగ్యత', 'తార', 'కామధేను', 'చదువుకున్న కూతురు' అనే నాలుగు కథలున్నాయి. ఈ నాలుగూ నాలుగు రత్నాలే. "యోగ్యత" పరిసరాలనుబట్టి వేషమెంత మారినా ప్రకృతిసిద్ధంగావుండే గుణాలు పైకుబుకుతూ వుంటాయని చెబుతుంది.

పెద్దవారిమీద వెంతఅక్కసువున్నా పిల్లలమీద ప్రేమ ముసలాళ్ళను లొంగదీస్తుంది అనేదానికి నిదర్శనం 'తార'.

"భౌతికసౌందర్యముకంటే ఆత్మసౌందర్యమున్న భార్యయే భర్తకు స్వర్గధామాన్ని కల్పిస్తుంది" అంటుంది 'కామధేను'.

'చదువుకున్న కూతురు', కొంతమంది విద్యావతులు విచిత్రాభిప్రాయాలతో వైవాహిక జీవితానికి యేలా దూరమౌతూ వుంటారో చూపుతుంది.

రచనావిధానమూ, శైలి చాలా సరళంగానూ ఆకర్షణీయంగానూ వున్నాయి.

## విపంచి—కాత్యాయిని.

గ్రంథకర్తలు శ్రీ బొడ్డు బాపిరాజుగారు. దీన్ని కూడా నమ్మాళ్వార్సే ప్రకటించారు. వెల 6 అ.

'విపంచి' వివిధవిషయములపై వ్రాసిన, పద్య రత్నాల కూర్పు. ఇందులోని పద్యాలు చదువుతూ వుంటే "పద్యాలుకూడా ఇంత చక్కగా వ్రాయవచ్చా" అనిపిస్తుంది సాధారణ పాఠకులకు. వాటిలోని శయ్య, నుడికారము, సరళత, మాధుర్యము పాఠకుని పరవశునిచేస్తాయి. మచ్చుకొకటి చెబుదామా అంటే తక్కినవన్నీ తక్కువనుకుంటారేమో అనిపిస్తుంది. 'ఈమనోహర గీతికాస్తోమము, మాలపించుకొన్నది విశ్వవిపంచి మున్నె' అన్నారు గ్రంథకర్త. ముందేగాదు, ఇప్పుడూ ఎప్పటికీ, విశ్వవిపంచి ఈ మనోహర గీతికాస్తోమాన్ని ఆలపించుకుంటూనే వుంటుంది.

'కాత్యాయిని' వారి 'చిన్నతల్లి'కి—ముద్దుబిడ్డకు తల్లిదండ్రులు రెండవ పుట్టినరోజున అర్పించిన మూడిద. పరమాత్ముని స్వరూపము. ప్రకృతి సౌందర్యానికి నిల

యము, ఆనందానికి నిధానము అయిన శిశుమూర్తి యేలావుంటుందో కాత్యాయినిలోని కవిత్వముకూడా అలాగే వుంది. పసిబిడ్డనుచూస్తే చూచినవారికంతా ప్రేమేలా పైకుబుకుతుందో కాత్యాయిని చదివినవారికంతా అలా ఆనందము పొంగి పొరులుతుంది.

## మాప్లా తిరుగుబాటు.

కర్త శ్రీ తుమ్మల వెంకట్రామయ్యగారు. వెల ప్రతి 1 అ. దొరుకుచోటు నవశక్తి కార్యాలయం, బెజవాడ.

హిందూదేశ చరిత్రలో మాప్లాతిరుగుబాటు భారత స్వాతంత్ర సంగ్రామ సమరములో ఒక ఘట్టము. ఈ తిరుగుబాటునుగురించి యథార్థము యింతవరకూ యెక్కడా వెల్లడింపబడలేదు. ఈపుస్తకము క్లుప్తంగా ఆకొరతతీరుస్తుంది. అందరూ చదవతగింది.

## లెనిన్ ఉపదేశాలు - పారిస్ కమ్యూన్.

అనువాదకులు రామమోహన్ గారు, విశ్వసాహిత్యమాల, ముంగండ. అంబాజీపేట Po. తూ. గోదావరి. వెల 0–6–0.

విశ్వసాహిత్యమాలవారు రాజకీయ గ్రంథములను ముఖ్యముగా సోషలిజమునకు సంబంధించిన మంచి పుస్తకాలను ప్రకటిస్తూ చక్కని రాజకీయ విజ్ఞానం వ్యాప్తిచేస్తున్నందులకు ఆంధ్రులు వీరిని అభినందించాలి. మాటలతోటే కాకుండా కార్యరూపంగా కూడా, చాలాకొద్దిధరగల వారి పుస్తకాలను కొని వారికి చేయూతనివ్వాలి. విద్యావ్యాప్తిలేని కారణం చేతనూ యింగ్లీషు చదువుకొన్నవాళ్లు యింగ్లీషు పుస్తకాలే కొనడంచేతనూ తెలుగు పుస్తకాలకు ఖర్చు తక్కువ. అయినా యీ సోషలిజాన్ని తెలిపే పుస్తకాలు యింగ్లీషులో చాలా ధరకలవి కాబట్టి కాలేజీ విద్యార్థులుకూడా యీపుస్తకాలు కొనడం ఉత్తమం.

తల్లే విషం పెట్టినట్లు కాంగ్రెసు గవర్నమెంటే వీరి పుస్తకాలలో కొన్ని బహిష్కరించింది అంటే యింతకన్నా శోచనీయం ఉంటుందా?

లెనిన్ ఉపదేశాలలో లెనిన్ యొక్క జీవితం మార్క్సు సిద్ధాంతాలను అతడు కార్యరూపంగా ఏర్పరచడం రాజకీయంగా సాంఘికంగా ఆర్థికంగా అతడు కావించిన ఉత్తమ సంస్కరణాలు యిందులో బాగా వ్యక్తీకరింపబడ్డాయి. సోషలిజం తెలుసుకోవాలనే ప్రతియువకుడు చదువతగ్గది.

పారిస్ కమ్యూన్‌లో యూరపుయందు ప్రప్రథమంలో పరిశ్రామికులు ఏలా రాజ్యం వశంచేసుకొని పరిపాలించారో విశదమౌతుంది. యిదే నవీనయుగాని కారంభం. కమ్యూన్ వల్ల నేర్చుకోవలసినపాఠాలు చాలాఉన్నాయి. ఈ పుస్తకం ఎలెనిన్ చేతనే వ్రాయబడ్డది కాబట్టి ముఖ్యంగా చదువతగ్గది.

—ఆచార్య.

## మాధవ నిదాన శేషము.

గ్రంథకర్త 'రాజవైద్య' ద్విభాష్యం వేంకటరావుగారు, వేంకటేశ్వర వైద్యామృత నిలయము మండపేట, తూ. గో. వెల ప్రతి రూపాయు.

దేశీయ వైద్యానికి ప్రాముఖ్యము ఇవ్వాలనే ఈ జుల్లో ఇలాంటి గ్రంథప్రచురణ అవసరమే. ఇందు సంస్కృత శ్లోకాలకు సరళమైన తెలుగు తాత్పర్యం వ్రాయబడినది. ఆయుర్వేద విద్యార్థుల కుపకరిస్తుంది.

## జాతక రాజము.

ఇది సింగయార్య ప్రణీతము. కర్త ఎప్పటివాడో నిర్ణయించడాని కిందులో ఆధారమేమీ ఉన్నట్టు లేదు. దీన్ని శ్రీయుతులు శ్రీధర వెంకయ్య సిద్ధాంతిగారు, శ్రీధర విశ్వనాథశాస్త్రిగారు ఆంధ్రవ్యాఖ్యానములో ప్రచురించారు.

ఆంధ్రదేశములో బహుళ ప్రచారములేని జైమిని మతావిష్కరణార్థమై వ్రాయబడినదే 'జాతక రాజము.' అయినా ఇది జైమినీయ గ్రంథములోని మొదటి రెండధ్యాయాలకే వివరణము. సింగయార్యుడు స్వతంత్రించి ఎన్నో నూతన విషయాలు చేర్చి

నాడు. ఇందులోని శ్లోకాలకు ప్రతిపదార్థం తాత్పర్యం కూడా వుంది. వెల రెండు రూపాయలు. ప్రతులకు దైవజ్ఞ గ్రంథమాల 'తెనాలి.'

## ఆంధ్ర వాచస్పత్యము.

శ్రీ కొట్ర శ్యామలశాస్త్రి గారు, కడప, కాకినాడ తా. వెలువరిస్తూవున్న యీ గ్రంథము 19, 20, 21 భాగాలు అందుకొన్నాము. ప్రతి భాగము వెల రూపాయ.

19వ భాగములో 'పాట్టికలు'నుండి 'బుడుబుడుక్కలవాడు' వఱకును, 20వ భాగములో 'బుడుమ' మొదలు 'మస్నె' వఱకు, 21 భాగములో 'మస్నదు' మొదలు 'మ్లేచ్ఛుడు' వఱకు పదాలున్నాయి.

## బాల్యవివాహనిరోధచట్టము

## (శారదాచట్టము)

శారదాచట్టములోని అంశాలను శ్రీ కామరాజు కృష్ణమూర్తిగారు పరిచయభావలో వ్రాసి తెలుగులో కాని కల్పించారు. ఇందులో 1938 వ సం. సవరణలు చేర్చినారు. ఎక్కడెక్కడ వివరణ అవసరమో అక్కడక్కడంతా వ్యాఖ్యానము చేసినారు. హైకోర్టులతీర్పులనుకూడా కొన్నిచోట్ల ఉదాహరించినారు. శారదాచట్టవిషయాలను తెలిసికొనడానికి చక్కగా ఉపకరిస్తుంది. వెల నాలుగణాలు—కొంచమెక్కువేమో? ప్రతులకు, గ్రంథకర్తకు. శ్రీకృష్ణాపురము, రాయపేటపోస్టు, మద్రాసుకు వ్రాయగలరు.

## సీతాన్వేషణ

మారుతీగ్రంథమండలి (ఉరవకొండ, అనంతపురము జిల్లా) 8 వ ప్రచురణము. కర్త శ్రీ చింతా నరసింహారెడ్డిగారు. చందాదారులకు 8 అ. ఇతరులకు 10 అ.

కథ సుప్రసిద్ధము. రచయిత ఇదివఱకే 'సీతాపహరణ'మనే నాటకాన్ని రచించినారు. ఇది తరువాతికథను వస్తువుగాగొని రచింపబడినది.

రచన పూర్వపక్కి. భావ పాత్రౌచితిని పరిస్థితులను గమనింపదు. సాధ్యమైనన్ని పద్యాలు చేర్చబడినవి.

పాత్రలకు రచయితకూర్చిన వన్నె ఏమీలేదు. నవీనరుచులనుబట్టి ఇది చదివినా, తెరమీద కెక్కించినా ఆకర్షణీయమవుతుందా అని సందేహం కలుగుతుంది.

## గాంధి చరిత్రము

గ్రంథకర్తలు శ్రీ కొమండూరి శఠకోపాచార్యుల వారు, కాకినాడ. డబులుక్రౌను 234 పుటలు. వెల 8 అ.

వీరు బహుగ్రంథములనురచించి ఆంధ్రుల చేత మెప్పువడిసినవారు. వీరి రచనలన్నీ యీ కాలానికత్యవసరంగా కవపడతాయి.

భారతదేశానికి మకుటములేని సార్వభౌముడు మహాత్ముడు. తక్కినవారంతా తరువాతివారే. వారి చరిత్రను చదువవలసిన విధి ప్రతిభారతీయునిమీదా వుంది. దానికిదివఱకే వారిఆత్మకథ వుంది. అయినా అది 1921 వ సం. తో ముగుస్తుంది. ఆతరువాతసంగతులు తెలియాలంటే తెలుగులో పుస్తకాలుతక్కువ. ఆచార్యులవారు మహాత్మునిచరిత్రను, వారికిసంబంధించిన విషయాలను 1921 వఱకు క్లుప్తముగా వ్రాసి, తరువాతి చరిత్రను కొంతవిపులముగా వ్రాసినారు. కాంగ్రెసుఉద్యమము, సత్యాగ్రహచరిత్ర, మహాత్ముని ప్రాముఖ్యము ఇవన్నీ ఇందులో వున్నాయి. ప్రతివారూ చదువదగినగ్రంథము.

## దేవుడు

రచయిత శ్రీ స్థానాపతి రుక్మిణమ్మగారు.

దేవుడిపుడు ప్రపంచదృష్టిలో 'కలడు లేడను వాదములకు' ఓర్చుకొనవలసినవాడుగా ఉన్నాడు. ఆతనిగూర్చిన అపోహలే దీనికి కారణం. ఇవి తొలగడానికి ఇటువంటి పుస్తకాలెంతైనా తోడ్పడుతవి. రచయితగారు మహోన్నతభావాలతో నిండివుండే ఉపనిషత్ శ్లోకాలను సేకరించి వాటికి సరళమైన ఆంధ్రతాత్పర్యము వ్రాసినారు. ఈపుస్తకము చిన్నదైనా ప్రపంచభాషలన్నింటిలోనికీ పరివర్తింపదగి వుంది. ఇలాంటి ఉత్తమగ్రంథ రచయితలగు రుక్మిణమ్మగారు ధన్యులు.

వెల తెలియదు. ప్రతులకు గరుడా సీలయ్యశ్రేష్ఠిగారు, విశాఖపట్నం వ్రాయగలరు.



కర్నూలు మహిళా సమాజ బాలికలు

సమాజ రేడియోనిధికై నాటకప్రదర్శనము జరిగినపుడు తీయబడిన ఛాయాపటము. సమాజాధ్యక్షురాలైన మిసెస్ పి. ఎస్. రామస్వామిగారు మధ్య కూర్చొనియున్నారు.

# పత్రికా లోకము

**ఆంధ్రవాణి.**

బెజవాడనుండి శ్రీ బి. ఎస్. శర్మగారి సంపాదకత్వాన ప్రతిసోమవారము గురువారము వెలువడు ద్వైవారపత్రిక. విడిప్రతి అణా. సాలుచందా రు. 6

"సంస్థానాల నిరంకుశత్వ నిరోధమే ఆంధ్రవాణి ఆశయం." ముఖ్యంగా హైద్రాబాదువిషయమై తీవ్రంగా వ్రాస్తుంది. వార్తలు, విమర్శలు, ఇతర వ్యాసాలూ గలవు. ఆంధ్రుల సేవలో మన్ననపొందు నని ఆశిస్తాము.

**దివ్యవాణి.**

సికింద్రాబాదు (దక్కన్) నుండి శ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రిగారి సంపాదకత్వాన ప్రతి సోమవారము ప్రకటింపబడుపత్రిక. విడిప్రతి అణా. సాలు చందా మూడురూపాయలు. హైదరాబాదు, సికింద్రాబాదు వాసులకు సాలుచందా రెండున్నర రూపాయ.

భారతదేశస్థితికి పాటుబడుట పత్రికోద్దేశము. పత్రిక ఇంకా ఆకర్షణీయంగా ఉంటేబాగు. ఇది పేరు సార్థకమయ్యేటట్టు పాటుపడుతుందని విశ్వసిస్తాము.

**జనవాణి (జన్మదిన సంచిక)** ✓

ద్వితీయ జన్మదినసంచిక మా కార్యాలయం అలంకరించింది. అందులోనిచిత్రాలూ, వ్యాసాలూ, పద్యాలు గద్యాలూ, గీతాలూ అన్నీ ఆకర్షణీయంగా ఉన్నాయి. ప్రత్యేకసంచికలను "మొనాపలీ" చేసికొనే ప్రసిద్ధరచయితలకే సంచికంతా పంచియివ్వకుండా "నవనవోన్మేషమునందుచున్న యువజన ప్రతిభకు" అవకాశమివ్వడము ప్రశంసనార్హము.

**ఆంధ్రభూమి (మద్రాసు సంచిక)**

ఆంధ్రమహాసభలు సమావేశమయ్యే ముందుగా ఈసంచిక వెలువడి ఆంధ్రప్రతిభనుగురించీ, మద్రాసు మనదే అనే వాదాన్నిగురించీ ఎన్నోవిషయాలు తెలిపింది. ఇందలివ్యాసములన్నీ మద్రాసు ఆంధ్రుల నగరమే, నడుమ అరవల అధికారాలకు లోబడిపోయింది అనేసంగతిని స్పష్టపరుస్తాయి. మద్రాసు అనే పేరు అసలు మనమిచ్చిందే, చోటు ఆంధ్రులదే, ఇతరులకు ఈప్రదేశమిచ్చిందీ ఆంధ్రులే, పట్టణాన్ని అభివృద్ధిపరచిందీ ఆంధ్రులే, ఆందు మొదటినుంచీ పట్టణములోని ప్రముఖులంతా ఆంధ్రులే—అనేవిషయాలు ఈసంచికలో సంపాదకులు చాలాపరిశ్రమతో సమకూర్చారు. ఆంధ్రులు వారికి కృతజ్ఞులు.

**ఆంధ్రపత్రిక (దసరాసంచిక)**

పత్రిక ఆకర్షణీయంగా వుండాలని సంపాదకులు చాలా ప్రయత్నాలు చేసినట్టుంది. ఇందులో వివిధ శాఖలకుచెందిన విజ్ఞానవిషయాలు, కథలు, పద్యాలు, గీతాలు ఇవన్నీకూడా దానికి నిదర్శనాలే. ఇందులో ముఖ్యంగా గమనించదగ్గది కీ. శే. జీర్ణోద్ధారకులను గూర్చిన వ్యాసము. అది సంచికకు ఒక విధమైన ఉత్తేజం కలిగిస్తూవుంది. ✓

**ఢంకా (దీపావళి ప్రత్యేకసంచిక)**

దీపావళిని కేంద్రంగావుంచుకొని చుట్టూ పరిభ్రమించే కథలతో, నాటికలతో ఆంధ్రప్రముఖుల కేరిచేచర్లతో దీపావళిసంచిక ముచ్చటగా తయారైంది. చాలావ్యాసాలు సుప్రసిద్ధహస్తాలనుండే దిగుమతిఅయ్యాయి. ఎందులో కుళ్లున్నా దాన్ని ఢంకామీద బజాయించి నలువురకూ చెప్పడానికి ప్రయత్నిస్తారు సంపాదకులు. వారు సంపాదించిన వ్యాసాల్లోకూడా అగుణ మింతో అంతో కనపడుతూనే వుంది.




## 20-వ ఆంధ్రమహాసభ.

ఆంధ్రమహాసభలు ప్రారంభించి పాతికేండ్లకు పైననే అయినది. అప్పటినుంచి పందొమ్మిది సభా సమావేశములు జరిగినవి. అయితే వానిలో ఒకటైనా యీ యిరువదవ సమావేశమంత ప్రాముఖ్యము వహించిందా అంటే సందేహమే.

ఆంధ్రదేశాన చివరనున్న నగరములో ఆంధ్ర ప్రతిభను వారము దినాలలోపల సర్వతోముఖముగా ప్రదర్శించి, ఆంధ్ర రాష్ట్రాందోళనము పరిపక్వమైనదని చాటి, 'మద్రాసు నగరముమాదే, అదిమా రాష్ట్రమునకు ప్రధాన నగరముగా నుండవలసినదే' అని యైక్యకంఠమున గొంతెత్తి చెప్పి, యీ యిరువదవ సమావేశము ఆంధ్రమహాసభలలో గణ్యతకెక్కినది.

సభలు జరిగిన ఆ 'సప్తాహములో' ఆంధ్రు లొక్కటిగా వచ్చి పరహస్తగతమై ఉన్న చెన్నపురిని మొక్కవోని పరాక్రమములో వశపరచుకొనినట్లుగ గనిపించినది. ఎక్కడచూచినా ఆంధ్రులే. ఆదినాల్లో ఆంధ్రులు మద్రాసులో 'ఇందుగల రందు లేరను సందేహము' లేకుండా చేసినారు. వారి ప్రత్యేకతే దీనికి కారణము: నడకలో ప్రత్యేకత, మాటలలో ప్రత్యేకత, వ్యయములో ప్రత్యేకత.

తండోపతండాలుగా ఆంధ్రులు నగరాన్ని ఆక్రమించిందే నాటి గొప్పదనము కాదు. ఆంధ్రప్రతిభ దివ్యతేజముతో ఒక్క వెలుగు వెలిగింది. ఎక్కడచూచినా ఆంధ్రుల ప్రతిభ చాటే విషయాలే. కళా నృత్యముచేత చూపరులను చిత్తరువుల చేసే చిత్రకళా ప్రదర్శనము, ఎపుడూ కనని వినని జంత్రగాత్రముల రాల్లరగించు విమలగాంధర్వ విద్యచేత మైమరపించిన సంగీత సభలు, పురాణేతిహాస పురుషులను దలపచేసే బలప్రదర్శనాలు, ఎన్నో జరిగాయి.

ప్రతి ఆంధ్రునికీ ఆంధ్రరాష్ట్ర నిర్మాణమే పరమావధి. వారు హిందువులైనా, ఇతర మతములవారైనా, సనాతనులైనా, సంస్కారులైనా, కాంగ్రెసు వాదులైనా, కాకపోయినా ఆంధ్రులైన వారందరికి ఆంధ్రరాష్ట్ర నిర్మాణమే పరమాశయమని ఉత్సాహముతో ప్రకటిస్తూ అన్ని ప్రాంతాల నుండీ ఆంధ్రులు సమావేశాని కరుదెంచినారు.

ఈ మహోత్సాహానికి మకుటాయమానంగా 8 తేదీ మహాసభ సమావేశమైంది. శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిలుగారు మహాసభాహ్వాన సంఘాధ్యక్షులు; శ్రీ సర్ ముత్తా వేంకట సుబ్బారావుగారు సభా

ప్రారంభకులు; శ్రీ సర్. ఎస్. రాధాకృష్ణయ్యగారు సభాధ్యక్షులు. వీరందరుకూడ ఐక్యకంఠముతో ఆంధ్ర రాష్ట్రోద్యోళనము పరిపూర్ణమైనదనీ కార్యసాఫల్యానికి అనుసరించవలసిన మార్గాలివని చాటినారు.

అంతర్జాతీయ ప్రముఖులై కీర్తి గడించిన శ్రీ రాధాకృష్ణయ్యగారు ఈ మహాసభకధ్యక్షత వహించుట శుభావహము. వారీ రాష్ట్ర సమస్యను ఖండాంతరాలకు తీసుకొనివెళ్లి పరిష్కారానికి ప్రయత్నిస్తారనే నమ్మకమందరికీ వుంది.

ఆంధ్ర రాష్ట్రోద్యమము, ఆందోళన అనవసరమని ఆర్భాటాలు చేస్తూఉన్నవారికి అధ్యక్షులవారి క్రింది వాక్యాలు చేదుగానే వుంటాయి. అయినా అది సత్యమని అంగీకరింపవలసివుంటుంది. "భారతదేశములో స్వరాజ్యముకొఱకు జరిగే ఉద్యమము ప్రపంచకళ్యాణమునకు ఎట్లు భంగకరము కాదో అటులనే ఆంధ్రోద్యమమును జాతీయోద్యమమునకు భంగకరము కాదు."

అయితే దీని నాలస్యముచేయాలని కూడా అధ్యక్షుల అభిప్రాయము కాదు. "భారతదేశసమస్య పరిష్కారమగునంతవఱకు ఆంధ్రరాష్ట్రసమస్య నాపిఉంచవలయుననుటలో న్యాయమేమియు లేదని నా అభిప్రాయము" అన్నారు. ఆంధ్రులందరూ ఈ అభిప్రాయముతో తప్పకుండా ఏకీభవిస్తారు.

అసలు ఆలస్యానికి కారణమే లేదంటారు: "ఆంధ్రరాష్ట్రము అవసరమని, అది ఏర్పడుటకు అవకాశమున్నదని ఇక్కడ నేను గొప్పగా వాదింపవలసిన పనిలేదు. అది నేడు గవర్నమెంటు ఆమోదించిన పాలసీయే. జాతీయవాదుల అభిప్రాయమూ అదే."

కాబట్టి యీ ఆందోళన ఇట్టే చల్లగా ఆరిపోకూడదని అంటాము.

దీనికై అధ్యక్షులన్నట్లు అధికారులను ఒత్తిడి కలుగజేయవలసియున్నది.

అయితే కాంగ్రెసు కార్యసంఘము అలా కాగూడదని కట్టుదిట్టము చేసినది. కాని 'ఒక కార్య సంఘము నేర్పరచి యీ మహాసభ తీర్మానాల ననుసరించి ఆంధ్ర రాష్ట్ర సంపాదనకు తగినచర్య తీసుకొనవచ్చును.'

అధ్యక్షులు మద్రాసు ఆంధ్రరాష్ట్రానికి ప్రధాననగరముగా ఉండవలెనని అది ప్రభుత్వమువారి కిష్టములేకపోతే మద్రాసును రెండుగా విభజనచేసి ఆంధ్ర తమిళ రాష్ట్రాలు రెండింటికీకూడా ప్రధాననగరముగానే వుండవలెననీ సూచించినారు. మహాసభ అలాగే తీర్మానించింది.

ఇది చాలా గొప్పవిషయమే. అసలు మద్రాసు ఆంధ్రులిది. మద్రాసని దాని కా పేరు చిరస్థాయిగా ఉండేటట్లు చేసిందీ ఆంధ్రులే. అసలాన్ని ఇతరులకు విక్రయించిందీ ఆంధ్రులే. అంతకు ముందునుంచీ ఆ ప్రదేశానికి ఏలికలూ ఆంధ్రులే. మద్రాసును మహోన్నతస్థితికి తీసుకొనివచ్చిందీ ఆంధ్రులే. అందులో మొదటనుంచీ ప్రధానపీఠాల నాక్రమించిఉన్నదీ ఆంధ్రులే. అయితే మధ్యలో అరవలకు చోటిచ్చివారి ప్రాబల్యానికి ఇపుడు లొంగిపోయారు.

## సంపాదకీయములు

ప్రధాననగరముగా వుండవలెనని ఎపుడు మహాసభ తీర్మానించిందో అపుడే మద్రాసు మరీ ఆంధ్రులదిగా చేయాలన్న ఉద్యమానికి పునాది వేయబడినదన్న మాట. చేసిన తీర్మానము అమోఘమైంది; అర్థవంతమైనది. అయితే దీనిని సాధించడములో ఆంధ్రులు చూపవలసిన పట్టుదల, పరిశ్రమ, పలుకుబడి చాలావుంది. అపుడే తమిళులు చెన్నపురే గాదు, తిరుపతివఱకు మాదేనని ఆందోళన లేవతీస్తున్నారు. ప్రతిఘటనను ఆంధ్రుల కార్యదీక్ష శాంతముతో ఎదుర్కొనవలసివుంది.

మద్రాసు ఆంధ్రరాష్ట్రానికి ప్రధాననగరముగా నుండవలెనను తీర్మానము రాయలసీమవాసులహృదయాల్లోని భయాన్ని కూడా పోగొట్టింది. వారిలో కొంతమంది కోస్టల్ జిల్లాలవారు అభివృద్ధిచెంది ఉన్నారు, నోరుకలవారు, అందుచేత వెనుకబడివున్న తమరిని ఏమి చిన్న చూపు చూచెదరో అని అపనమ్మకముతో నుండేవారు. అది చాల వఱకు శ్రీభాగు ఒడంబడికతో తీరిపోయింది. కాని ఆంధ్రరాష్ట్రము వచ్చినా 'నోరుకలవారు' శ్రీభాగు ఒడంబడిక ప్రకారము రాయలసీమకు ప్రాముఖ్యము నిస్తారా అనే సందేహం కొంతవఱకు ఉండేది. మద్రాసు ముఖ్యపట్నం అన్న తరువాత వారికా సందేహంకూడా పోయింది.

రాష్ట్ర నిర్మాణావసరమున ప్రభుత్వము వారు సరిహద్దువిచారణ సంఘమును నియమింపక తప్పదు—వేరువిధముగా సరిహద్దులు తీర్మానింపబడితేతప్ప. అపుడు వారికి సలహాలను, కావలసిన వివరాలను అందచేయుట కొరకు సరిహద్దుసంఘాన్ని నియమించి, 1939 జనవరిలోపల 'ఆంధ్రరాష్ట్ర సరిహద్దులను వలసిన జనసంఖ్య లెక్కలతోపాటు నిర్ణయించి ఆంధ్రరాష్ట్రపటమునుకూడ తయారు చేయించవలెనని' సభ వారు తీర్మానించినారు. ప్రధానామాత్యులదృష్టిలో ఇట్టివి అనవసరమైనా సమస్యా పరిష్కారానికి పై సామగ్రి అత్యవసరముగా కనపడుతున్నాయి.

రాయలసీమక్షామ నివారణార్థము ప్రభుత్వమువారు అప్పయినాచేసి తుంగభద్రా ప్రాజెక్టును, ఇతర నీటిపారుదల ప్రాజెక్టులను వెంటనే నిర్మింపవలెనంటూచేసిన మహాసభా తీర్మానంకూడా ముఖ్యమైనదే. హృదయము దహించుకొనిపోయే రాయలసీమక్షామబాధలను కంటితో చూచినవారూ, వినినవారూ కూడా దీనివిషయమై శ్రద్ధవహించకుండా ఉండలేరు. శాసనసభ్యులంతా దీనికై ప్రత్యేక కృషిని చేస్తారని విశ్వసిస్తాము.

### త్రివర్ణ చిత్రము

'అనాథులకునాథుడు' అను చిత్రాన్ని వ్రాసినవారు సి. ఎస్. వెంకట్రావుగారు. వీరి చిత్రాలు అఖిల భారత దేశమంతటిలోనూ ప్రఖ్యాతే గాకుండా ప్రదర్శనాల్లో పతకాలనుకూడా గడించుకొన్నాయి. వీరు వ్రాసిన పెక్కు చిత్రాలను 'గృహలక్ష్మి' ప్రకటించినది. ఇటీవల మద్రాసులో జరిగిన చిత్రకళా ప్రదర్శనములో 'జటాయువు మరణము' (1938 సెప్టంబరు సంచికలో ప్రకటితము) ఉత్తమచిత్రముగా అంగీకరింపబడి రు. 50 లు బహుమతి ఇవ్వబడినది.

EDITED BY DR. K. N. KESARI, PRINTED AND PUBLISHED BY DR. S. SESHAGIRI RAO, AT THE LODHRA PRESS, ROYAPETTAH, MADRAS.